


C for Clown, for Caramilk. C for Cowb

Cara or Clown, C r Caramilk. C

Cool, C amilk. C f Clown, C for

mil Cool, C for Car k. C for C

fo milk. C for Cool, C f ramilk.

Cow y, C for Caramilk. C for C , C fo

milk. C for Cowboy, C for Carami C f

for Caramilk. C for Cowboy, C for Caram

Clown, or Caramilk. C for Cowboy, C

milk. C Clown, C for Caramilk. C for

for C C for Clown, aramil

Cool, Caramilk. n, C for

milk. f Cool, C for C milk. C for C

for rami . C for Cool,

Cowboy, C for Caramilk.







HTA 8194.

మీరు చదువుతున్నారా?

# వనిత



అంతర్జాతీయ మహిళా సంవత్సరంలో

ఉదయించి పదిహేడు సంవత్సరాలుగా




మన వనితల వికాసానికి తోడ్పడుతున్న

ఏకైక పత్రిక **వనిత**

నెలతల ప్రియ నెచ్చెలి

**వనిత**

• విజ్ఞానానికి • వికాసానికి • వినోదానికి

ఇది ఒక డాల్టన్ ప్రచురణ






'మేగీ జిగ్సా పజిల్'లో
మేగీ సాహసమయ ప్రపంచం
సమకూర్చుకోండి.

మేఘాలలో తేలిపోండి! 'మేగీ స్కై
ఫ్లైయర్'లో





మేగీ 'ఏస్ ఎడ్వెంచరర్స్ గేమ్'లో
సముద్రం నుండి ఆకాశం వరకూ
యాత్రను పూర్తి చేయండి.

మేగీ 'హూ-డన్-ఇట్ మిస్టరీ'
గేమ్‌లో దొంగను పట్టుకోండి.

# సరదా ప్రియులకు అద్భుత సాహస యాత్రలు!

## మేగీ క్లబ్ సదస్యులకు ఉచిత బహుమతులు!

ఇతర గ్రహవాసుల చతురతతో
తలపడండి-మీ తెలివితేటలతో 'మేగీ
రెయిడర్స్ ఆఫ్ ది రెడ్ స్టార్' గేమ్‌లో






ఏయ్! పిల్లలూ! మేగీక్లబ్‌లో చేరి మేగీ సాహస
ప్రపంచంలో ప్రవేశించండి!

మీరు మేగీ నూడుల్స్ యొక్క ఐదు ఖాళీ సంచులకు ముందు వైపున ఉండే ఈ [2-Minute] ను కత్తిరించి మీరు ఎంచుకున్న ప్రతి ఉచిత బహుమతి కోసం మాకు పంపించండి. అంతే! మీకు 6 నుండి 8 వారాలలో మేగీ క్లబ్ నుండి ఎంతో వినోదాన్నీ ఉత్సాహాన్నీ కలిగించే బహుమతి అందుతుంది.

గుర్తుంచుకోండి! మీరు మాకు లేఖ వ్రాసినప్పుడు మీకు కావలసిన బహుమతితోబాటు మీ పేరు, చిరునామా, మీరు పుట్టిన తేదీని పంపండి. ఈసరికే మీరు మేగీ క్లబ్ సభ్యులైతే మీ సభ్యత్వపు నంబరు పంపండి. ఒకవేళ మీరు మేగీ క్లబ్బర్ కాని పక్షంలో మేగీ క్లబ్ సభ్యత్వం పొందటానికిదే సదవకాశం. పై వివరాలు పంపేటప్పుడు సభ్యత్వం కూడా కావాలని వ్రాయండి. మేము మేగీ క్లబ్ మెంబర్‌షిప్ కార్డును మీ బహుమతితో బాటు ఉచితంగా పంపుతాము.

మా చిరునామా:

**MAGGI CLUB**
P.O. Box 5788 New Delhi-110 055




ఉచిత మేగీ
"వరల్డ్ ఆఫ్ ఎనిమల్స్" క్విజర్.
మీరు పొందే ప్రతి 2 బహుమతులతో ఒక మేగీ
"వరల్డ్ ఆఫ్ ఎనిమల్స్" క్విజర్ ఉచితం.

మరొక సదుపాయం కూడా! ఈ సరికి మీరు మీ మేగీ బర్డ్ హౌస్‌ను సేకరించనట్టయితే ఇపుడే సేకరించండి!

HTA 7778TE




# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి' సంచాలకుడు : నాగిరెడ్డి

## రాజ్యాంగశాసనం!

భారత జాతీయ కాంగ్రెస్, మహాత్మాగాంధి నాయకత్వంలో సరిగ్గా యాభై సంత్సరాలక్రితం, అంటే 1942 వ సం॥ ఆగస్టు 9 వ తేదీన 'క్విట్ ఇండియా' ఉద్యమాన్ని చేపట్టి విజయం సాధించింది. ఆ చారిత్రక ఘట్టాన్ని తగిన రీతిలో గుర్తుచేసుకునే విధంగా ఉత్సవాలు జరపడానికి సన్నాహాలు జరుగుతున్నవి.

మనం స్వాతంత్ర్యం పొంది, నలభై అయిదు సంవత్సరాలు పూర్తయింది. ఏ దేశానికైనా దాని రాజ్యాంగ శాసనం చాలా పవిత్రమైనది. అయితే, కాలం గడిచేకొలది, రాజ్యాంగ చట్టంలో సవరణలు ప్రవేశపెట్టడం, అవసరమైతే నూతన రాజ్యాంగ చట్టాన్ని రూపొందించుకోవడం అరుదైన విషయమేమీ కాదు. ఇటీవల, విడిపోయిన సోవియట్ యూనియన్‌లోని కొన్ని రాష్ట్రాలు, నూతన రాజ్యాంగం ప్రకారం ఒకటయ్యాయి. ఉభయ జర్మనీలు కొత్త రాజ్యాంగ శాసనం ప్రకారం ఒకటిగా విలీనమయ్యాయి. యుగొస్లావియా, కంబోడియా, థాయ్‌లాండ్ దేశాలలో నూతన రాజ్యాంగ శాసనం రూపొందించుకోవడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి.

మన భారతీయ రాజ్యాంగ శాసనం 1950 వ సం॥లో రూపొందించబడింది. ఈ 42 సంవత్సరాల కాలంలో దాదాపు 60 సవరణలు ప్రవేశపెట్టడం జరిగింది. అందువల్ల మనదేశంలోని మేధావులు కొందరు—ప్రస్తుత పరిస్థితుల దృష్ట్యా మన రాజ్యాంగాన్ని పునః పరిశీలించాలనీ, శాంతిభద్రతలకు లోటు రాకుండా నీతి, నిజాయితీ, న్యాయం గల అభ్యుదయ మార్గంలో దేశాన్ని నడిపించగల నూతన రాజ్యాంగశాసనాన్ని రూపొందించుకోవాలనీ అభిప్రాయపడుతున్నారు. ఇది ఆలోచించవలసిన విషయమే.

మన రాజ్యాంగం గురించి ఆలోచించేప్పుడు, దానిని రూపొందించిన భారత రాజ్యాంగనిర్మాత డా॥ బి. ఆర్. అంబేడ్కర్‌ను సగౌరవంగా తలుచుకోవాలి. ఆయన శతజయంతి ఉత్సవాలు ఇటీవలే జరుపుకున్నాము. మన దేశానికి కావలసిన ఉత్తమ రాజ్యాంగ శాసనాన్ని 'భావి నిర్మాతలు' రూపొందించ గలరని ఆశిద్దాం!

సంపుటి 90 ఆగస్టు '92 సంచిక 2

విడి ప్రతి : 4-00 : : సంవత్సర చందా : 48-00

CHITRA

వార్తలు-విశేషాలు:

# రియో డి జనీరో సమావేశం




ఐక్యరాజ్య సమితి అధ్వర్యంలో బ్రెజిల్ లోని రియో డి జనీరో నగరంలో, జూన్ నెలలో భూపరిరక్షణ శిఖరాగ్ర సమావేశాలు జరిగాయి. వాతావరణ కాలుష్యం నుంచి భూమిని రక్షించుకోడానికి ఏమేం చేయాలి? ఎటువంటి పథకాలను రూపొందించాలి? అన్న విషయాలను చర్చించడానికి ఏర్పాటు చేసిన ఈ శిఖరాగ్ర సమావేశాలలో 115 దేశాల నాయకులు పాల్గొనడం విశేషం. అత్యధిక సంఖ్యలో ప్రపంచ నాయకులు పాల్గొన్న అంతర్జాతీయ సమావేశం ఇది అని పరిశీలకులు అభిప్రాయ పడుతున్నారు!

ఈ సమావేశంలో పాల్గొన్న నాయకులందరూ ముఖ్యంగా 'బయోడైవర్సిటీ' 'గ్లోబల్‌వార్మింగ్' (భూమి వెచ్చబడడం) అనే రెండు ప్రధాన విషయాలను ప్రస్తావించారు. వారి ఉపన్యాసాలను అందరూ శ్రద్ధగా విన్నారు. అయితే, ఈ భూపరిరక్షణ సమావేశాలు అనుకున్న తమ లక్ష్యాన్ని సాధించలేదు—అని సుప్రసిద్ధ అంతర్జాతీయ వాతావరణ సంస్థ 'గ్రీన్ ప్లేస్' అభిప్రాయం వెలిబుచ్చింది.

ఈ సమావేశాలలో నలుగురు కుర్రాళ్ళు—కెనడానుంచి ఇద్దరు, చిలీ నుంచి ఒకరు, జర్మనీనుంచి ఒకరు పాల్గొని తమ అభిప్రాయాలతో సభికులకు నూతనోత్తేజం కలిగించారు. భూమిని రక్షించుకోవాలంటే మన మార్గాలను మార్చుకోవలసిన సమయం ఆసన్నమయింది; ఆ విషయాన్ని నాయకులకు గుర్తుచేయడానికే మేము ఇంత దూరం వచ్చాము—అని వాళ్ళు తెలియజేశారు. కెనడానుంచి వచ్చిన పన్నెండేళ్ళ అమ్మాయి సివెర్న్ సుజూకీ తన ఉపన్యాసంలో ఇలా అన్నది:

''నేను నా భవిష్యత్తుకోసం పోరాడుతున్నాను. ప్రపంచం మొత్తంమీద ఆకలితో అలమటిస్తున్న పిల్లల తరఫున నేను మాట్లాడుతున్నాను. ఈ భూమి మీద ప్రతి నిమిషం ప్రాణాలు కోల్పోతూన్న అసంఖ్యాకమైన జంతువుల తరఫున, పక్షుల తరఫున మాట్లాడు

తున్నాను. ఎండలో నడవడానికి నాకు భయం వేస్తున్నది. కారణం—ఓజోన్ పొరలో రంధ్రాలు. ఎటువంటి రసాయనిక పదార్థాలున్నాయో కదా అని గాలి పీల్చడానికి కూడా భయపడుతున్నాను. ఈ భూమిని మెరుగు చేయకపోయినా ఫరవాలేదు. దీనిని మరింత పాడుచేయడానికి మాత్రం పూనుకోకండి. పెద్దలైన మీకు ఈ విషయాలను గుర్తు చేయడానికే మేము సొంతంగా డబ్బులు పోగుచేసుకుని ఇక్కడికి వచ్చాము.''

ఈ అమ్మాయి మాటలు విని సభలోని వాళ్ళందరూ ఆనందాశ్చర్యాలు చెందారు. కొందరి కళ్ళు చెమ్మగిల్లాయి.

సమావేశంలో ఆఖరి అంశంగా 'అజెండా 21' అన్న తీర్మానాన్ని ఆమోదించారు: అభివృద్ధి చెందిన దేశాలు గత ఒకటి రెండు శతాబ్దాలుగా, పారిశ్రామికాభివృద్ధి సాధించడానికి ప్రకృతి వనరులను మితిమించి దోచుకోవడం వల్ల వాతావరణానికి ఎనలేని హాని కలిగిస్తున్నాయి. ఈ నష్టాన్ని భర్తీ చేయడం—అది ఎంతటి వ్యయప్రయాసలతో కూడుకున్నదయినప్పటికీ అభివృద్ధి చెందిన దేశాల ప్రధాన కర్తవ్యం!




మానవజాతి అభివృద్ధికి ప్రకృతి వనరులను ఉపయోగించుకోవడం తప్పు కాదు. కాని, దానికీ ఒక హద్దు, పరిమితి అంటూ ఉండాలి. మనిషికీ, భూమికీ కూడా హాని కలగనటువంటి మధ్యేమార్గాన్ని అనుసరించాలి. భారత ప్రధాని శ్రీ పి.వి. నరసింహారావు ఈ సమావేశంలో పాల్గొని—సముద్రం వస్త్రంగా, పర్వతాలే వక్షాలుగా, కలిగిన ఓ భూమాతా నీకు నమస్కారం. నా పాదాలతో నిన్ను స్పృశిస్తున్నందుకు, తల్లీ, నన్ను క్షమించు—అన్న శ్లోకాన్ని ఉదహరించి పై విషయాన్ని విశదపరిచారు.

బ్రెజిల్ అధ్యక్షుడు సమావేశాన్ని ప్రారంభిస్తూ—నూతన ప్రపంచ నిర్మాణానికి ఇది ఆఖరి అవకాశం. దీనిని జారవిడుచుకో కూడదు అని విజ్ఞప్తి చేశారు.

వాతావరణ పరిరక్షణ విషయంలో ఈతరం ప్రపంచ నేతలు అనుకున్నది సాధించలేక పోయినప్పటికీ, ముందు తరం యువతీ యువకులు మాత్రం తప్పక సాధించగలరనే నమ్మకం ఏర్పడుతున్నది. అటువంటివారికే 21వ శతాబ్దం స్వాగతం పలుకుతున్నది!



# కట్నపిశాచాలు

రామేశం అనే ఒక మధ్యతరగతి కుటుంబీకుడి కూతురు విమలకు పెళ్ళీడు వచ్చింది. ఇద్దరు, ముగ్గురు విమలను చూసి వెళ్ళారు. వాళ్ళకు విమల నచ్చింది గానీ, రామేశం ఇవ్వజూపిన కట్నం నచ్చలేదు. ఈ విధంగా కూతురు పెళ్ళి పెద్ద సమస్యగా తయారైంది, రామేశానికి.

ఇటువంటి పరిస్థితుల్లో, పట్నంలో వ్యాపారం చేసుకునే రామేశం చిన్ననాటి మిత్రుడు భగవంతం, విమల కోసం ఒక సంబంధం తీసుకొచ్చాడు. పెళ్ళికొడుకు శంకరానికి పట్నంలో ఉద్యోగం. అతడి తల్లితండ్రులు పల్లెలో వ్యవసాయం చూసుకుంటున్నారు, బాగా స్థితిమంతులు. వాళ్ళకు విమల నచ్చింది. అయితే, పది వేలు కట్నం ఇవ్వాలనీ, పెళ్ళి ఘనంగా చేయాలనీ పట్టుబట్టారు.

రామేశం, భగవంతాన్ని పక్కకు తీసుకువెళ్ళి, "నా పరిస్థితి ఏమిటో నీకు తెలిసివుండీ, నా తాహతుకు తగిన సంబంధం తీసుకురాక, ఇటువంటిది తెచ్చావేమిటి? వీళ్ళతో నేను తూగగలనా!" అన్నాడు.

భగవంతం చిన్నగా నవ్వి, "పెళ్ళి ఖర్చులు నువ్వు పెట్టుకో. ప్రస్తుతానికి కట్నం డబ్బు పదివేలు నేను సర్దుతాను. ఐదారేళ్ళలో కొద్ది కొద్దిగా, నా అప్పు తీర్చు. కుర్రవాడు బుద్ధిమంతుడు. అమ్మాయి సుఖపడాలన్నదే, నా తాపత్రయం," అన్నాడు.

భగవంతం పూనుకోవడంతో, విమల పెళ్ళి కుదిరిపోయింది. పదిహేను రోజుల్లోనే ముహూర్తం. రామేశం పెళ్ళి పనుల్లో మునిగిపోయాడు. భగవంతం సర్దుతానన్న కట్నం సొమ్ము ఇంకా సర్దనే

మాచిరాజు కామేశ్వరరావు



లేదు. మర్నాడు సాయంత్రానికి పెళ్ళి వారు దిగనేదిగుతారు.

రామేశం కట్నం డబ్బుకోసం స్వయంగా పట్నం బయలుదేరాడు. అతను భగవంతం ఇల్లు చేరేసరికి సాయంత్రం కావస్తున్నది.

అన్ని పనుల్లో వుండి స్వయంగా వచ్చిన రామేశాన్ని చూసి, భగవంతం ఎంతగానో నొచ్చుకుని, "ఎంతో ప్రయత్నించినప్పటికీ రావలసిన డబ్బు చాలా ఆలస్యంగా, ఈ రోజే చేతికి వచ్చింది. రేపు మా అమ్మ ఆబ్దీకం అయ్యాక, డబ్బుతో బయలుదేరి వద్దామనుకున్నాను," అన్నాడు.

భగవంతం ఇచ్చిన డబ్బుసంచీ మొలలో దోపుకుని, రామేశం, "నాకు అవతల లక్షపనులు. ఏమీ అనుకోకు!" అని సంతోషంగా అక్కడినుంచి తిరుగు ప్రయాణమయ్యాడు.

అయితే, బాగా పొద్దుపోవడంతో, అతడికి బాడుగబండి ఏమీ దొరకలేదు. పట్నం నుంచి వాళ్ళ ఊరు చేరడానికి గచ్చపొదలతో, మద్దిమానులతో చిందర వందరగా వుండే, ఒక చిట్టడవి దాటవలసి వున్నది.

రామేశం చీకట్లో కాలిబాట వెంట నడుస్తూండగా, ఒక మద్దిచెట్టు చాటు నుంచి ముసుగుదొంగ ఒకడు మెరుపులా ముందుకు వచ్చి, రామేశానికి కత్తి చూపుతూ, "కిక్కురుమనకుండా, నీ దగ్గిరున్నదంతా ఇచ్చెయ్యి!" అన్నాడు కరుకుగొంతుతో.

రామేశం నోటమాట రాలేదు. దొంగ, రామేశం దుస్తులు తడిమి, డబ్బు సంచీ తీసుకుని చీకట్లో కలిసిపోయాడు. ఇక తను జన్మలో కూతురు పెళ్ళి తల పెట్టడంకల్ల—అనుకుంటూ, పొంగుకు వచ్చే దుఃఖంతో రామేశం ముందుకు నడవసాగాడు.

ఒకచోట, దారిపక్కనే వున్న పాడు బడిన గుడిసెముందు రెండు పిశాచాలు

చలిమంట వేసుకుని కబుర్లు చెప్పుకుంటున్నవి. వాటి మాటల్లో విమల ప్రస్తావన రావడంతో, రామేశం ఆశ్చర్యపోయి, ఒక చెట్టు పక్కన నిలబడి, వాటి మాటలు వినసాగాడు.

''ఎలా అయితేనేం, రేపురాత్రికి విమల పెళ్ళి జరిగిపోతున్నది!'' అన్నది ఒక పిశాచం నవ్వుతూ.

''కట్నం డబ్బు దొంగ కాజేశాడుగా! ఈ పెళ్ళి జరగనట్టే!'' అన్నది రెండో పిశాచం సాగదీస్తూ.

''ఈ మధ్య నీ చూపు బాగా మందగించినట్టున్నది! ఆ దొంగ పాము కరిచి, ఆ మద్దిచెట్టు వెనకే పడివున్నాడు. కట్నం డబ్బు చేజారిపోయిందని ఎలా అనుకున్నావు?'' అన్నది మొదటి పిశాచం.

ఆ మాటలు వినగానే రామేశానికి, పోయిన ప్రాణం లేచి వచ్చినట్లయింది. అతడు వెనుదిరిగిపోయి, చెట్టు వెనక చచ్చి పడివున్న దొంగను చూశాడు. వాడి పక్కన డబ్బు సంచీతోపాటు, ఒక నగల మూట కూడా వున్నది. రామేశం తన డబ్బుతోపాటు నగల మూటను కూడా తీసుకుని, నగలను తర్వాత పట్నంలోని కొత్వాలుపరం చేయవచ్చుననుకుంటూ, పరమానందంతో ఇల్లు చేరాడు.



జరిగింది విన్న రామేశం భార్య భానుమతి, ''అదృష్టవంతులం! మన సొమ్ము మనకు దక్కింది,'' అన్నది తేలిగ్గా నిట్టూరుస్తూ.

ఆ సాయంత్రానికి పెళ్ళివారు విడిదిలో దిగారు. విమల చెల్లెలు పెళ్ళివారికి నిమ్మరసం అందిస్తూండగా, పెళ్ళికొడుకు అక్కగారు, తల్లితో, ''ఇదిగో, చూశావా అమ్మా! మన ఇంటి నుంచి ముసుగు దొంగ ఎత్తుకుపోయిన నా నగలు, ఈ అమ్మాయి మెడలో వున్నవి,'' అంటూ విమల చెల్లెలి చెయ్యి పట్టుకున్నది.

పెళ్ళి సందడిలో, తమ కూతురు దొంగ దగ్గిర దొరికిన నగలు మెడలో

వేసుకున్న సంగతి, రామేశం దంపతులు గమనించనేలేదు.

''దొంగసొత్తు, మీ ఇల్లు ఎలా చేరింది? చూడబోతే ముసుగుదొంగ, మీ తాలూకూ మనిషిలాగే వున్నాడు!'' అన్నది పెళ్ళికొడుకు తల్లి, విమల చెల్లెలి మెడలోని నగలు తీసుకుంటూ.

అప్పుడే అక్కడికి వచ్చిన రామేశాన్ని, ''ఈ నగలు నీకెక్కడివి?'' అంటూ అందరూ నిలదీసి అడిగారు.

''ఒక చచ్చిపోయిన ముసుగుదొంగ దగ్గిర దొరికాయి.'' అన్నాడు రామేశం.

''అబద్ధం! మా అమ్మాయి నగలు ముసుగుదొంగ దోచుకుపోయాడని అనడం విని, ఇప్పుడు అవి ముసుగుదొంగ దగ్గిర దొరికినవంటున్నావు. దొంగలతో సంబంధం మాకు వద్దనేవద్దు!'' అంటూ అప్పటికప్పుడు పెళ్ళివారు విడిది ఇల్లు విడిచి వెళ్ళిపోయారు.

ఆ రాత్రి రామేశం కుటుంబంలోని ఎవరి కంటిమీదా కునుకులేదు. తెల్లవారుతూండగా, ఎవరో తలుపు కొడుతూంటే, విమల వెళ్ళి తలుపు తెరిచింది. గుమ్మంలో పెళ్ళికొడుకు శంకరం!

ఇంతలో రామేశం, భానుమతీ లేచి అక్కడికి వచ్చారు. శంకరం వాళ్ళతో, ''మీకు అభ్యంతరం లేకపోతే, అనుకున్న ముహూర్తానికి మీ అమ్మాయిని పెళ్ళి చేసుకుంటాను. కట్నం ప్రసక్తి మాత్రం తేకండి.'' అన్నాడు.



ఆ విధంగా విమల వివాహం నిర్విఘ్నంగా జరిగిపోయింది.

ఆ సాయంత్రం విమల, శంకరాన్ని, "ఒక సంగతి అడుగుతాను. అందరితో పాటు వెళ్ళిపోయిన మీరు, మనసుమార్చుకుని వచ్చి, కట్నం తీసుకోకుండా నన్ను పెళ్ళి చేసుకోవడానికి కారణం ఏమిటి?" అని అడిగింది.

అందుకు శంకరం చిన్నగా నవ్వి, ఇలా చెప్పాడు: తల్లిదండ్రులతోపాటు తిరుగుప్రయాణం అయిన శంకరం, వాళ్ళ ఊరు వెళ్ళడం ఇష్టంలేక, పట్నం వెళ్ళి ఉద్యోగంలో చేరిపోదామని ఒంటరిగా బయలుదేరాడు. చిట్టడవిలో ఒకచోట చితుకులమంట దగ్గిర కూర్చుని, కబుర్లు చెప్పుకుంటున్న రెండు పిశాచాలు అతడి కళ్ళ బడ్డాయి. శంకరం మెల్లగా ఒక చెట్టు చాటుకు పోయి, వాటి మాటలు విన్నాడు:

పిశాచాల్లో ఒకటి పెద్దగా ఆవులించి, "మరేం అనుకోకు, ఒక విషయం తెలుసుకోవాలని ఉన్నది. ఇంతకూ నువ్వు పిశాచంగా మారడానికి కారణం ఏమిటి?" అని అడిగింది రెండోదాన్ని.

"నేను బతికుండగా చిన్నా, పెద్ద దొంగతనాలతోపాటు ఒకటి, రెండు కాపురాల్ని కూడా నిలువునా కూల్చి, ఆ పాపం తగిలి, ఇలా పిశాచాన్నయి కుమిలిపోతున్నాను. మరి, నీ సంగతేమిటి?" అన్నది రెండో పిశాచం.



దానికి మొదటి పిశాచం కళ్ళ నీళ్ళు పెట్టుకుని, "నా ఇద్దరు కొడుకుల పెళ్ళిళ్ళ వ్యవహారంలో, నా వియ్యంకుల్నీ, కోడళ్ళనూ కూడా కట్నకానుకల పేరుతో అనుకున్న దానికన్నా ఎక్కువ గుంజి, నానా హింసలపాలూ చేశాను. ఇది భరించలేక ఒక వియ్యంకుడు కట్టు గుడ్డలతో దేశాలుపట్టిపోయాడు. ఒక కోడలికి మతి చలించింది. అందుకు పిశాచరూపంలో, ఈ విధంగా శిక్ష అనుభవిస్తున్నాను!" అన్నది.

మొదటి పిశాచం కాసేపు తలాడిస్తూ వూరుకుని, "నాలాగే నీకూ చేసిన పాపాలకు తగినశాస్తి జరిగిందనుకో! అయితే, ఆ శంకరం అనే కుర్రాడూ, అతడి తల్లిదండ్రుల సంగతేమిటి? ఆడపెళ్ళివారినుంచి శక్తికి మించిన కట్నం గుంజే ప్రయత్నం చేయడమే గాక, వాళ్ళమీద లేని దొంగతనం అంటగట్టి వెళ్ళిపోయారు. కాబోయే మామ మాటలు నమ్మక, ఆ శంకరం విమలలాంటి వజ్రాన్ని కాలదన్నాడు. పెళ్ళి మధ్యంతరంగా ఆగిపోయిందంటే, ఆ అమ్మాయికి చెడ్డపేరేగదా? మరి ఈ పాపానికి శిక్షేమిటంటావు?" అన్నది.

"ఆ శిక్ష ఎలా వుంటుందో, అందుకు మనమే సాక్ష్యం. పోనీలే, అందరూ హింసా, దొంగతనాలూ, కట్నాలు గుంజడం మానేస్తే, ఇక మన లోకానికి వచ్చేవాళ్ళే వుండరు! అప్పుడు మనం ఒంటరి బతుకులు బతకవలసి వస్తుంది," అన్నది రెండో పిశాచం.

శంకరం ఇంతవరకూ విమలకు చెప్పి, "విమలా! ఇది విన్నాక, మీ నాన్నగారు దొంగతనం చేయలేదని గ్రహించాను. పిశాచాలు నా కళ్ళు తెరిపించినై. నేను అప్పటికప్పుడే వెనుదిరిగి, మీ ఇంటికి వచ్చాను," అన్నాడు.

విమల తను చూడని, ఆ పిశాచాలకు మనసులోనే కృతజ్ఞతలు చెప్పుకుని, మర్నాడు భర్తతోపాటు అత్తవారింటికి ప్రయాణమయింది.






[సారససరోవర విడిదిభవనం నుంచి హఠాత్తుగా కనిపించకుండా పోయిన వీరగిరి యువరాణి విద్యావతిని వెతకడానికి, మహారాజు వీరసేనుడి అజ్ఞానుసారం సేనాధిపతి ఉగ్రసేనుడు, భటులను నలుదిశలకూ పంపాడు. మరునాడు యువరాణిని వెతకడానికి రాజుగారి అనుమతిని వేడుతూ ఒక యువకుడు రాజదర్శనం కోసం వచ్చాడు. —తరవాత ]

భవనం లోపలికి భటుడు తీసుకువచ్చిన యువకుడు రాజును చూడగానే చేతులు జోడించి గౌరవంగా నమస్కరించాడు. రాజు ఆ యువకుణ్ణి నఖశిఖ పర్యంతం పరీక్షగా చూశాడు. ఆ యువకుడి వేషధారణ సాధారణంగా ఉన్నప్పటికీ, అతని చూపులలో అసాధారణమైన రాచ ఠీవి, గాంభీర్యం స్పష్టంగా కనిపించాయి. ఆ యువకుణ్ణి గురించి, అంతకు ముందు సేనాధిపతి చెప్పిన మాటలలో ఎంతో నిజముందని రాజు గ్రహించాడు.

అంతలో సేనాధిపతి, ''ఈ యువకుడే మన యువరాణిని వెతికి తీసుకురావడానికి అనుమతి కోరివచ్చాడు,'' అన్నాడు.

రాజు ఆ యువకుడితో, ''నీ పేరేమిటి? నువ్వెవరు? మా సైనికులు నలుదిశలకూ వెళ్ళి యువరాణిని వెతికి వచ్చారు. మరికొందరు పొరుగు రాజ్యా



"మహారాజా! నా పేరు మహేంద్ర నాథుడు. రాజధానీ నగరానికి కొద్ది దూరంలో ఉన్న దేవీ ఆలయ సమీపంలో నేనూ, మా తల్లీ ఉంటున్నాము. మా తల్లి, రోజూ పూలు కోసి, మాలకట్టి దేవీ ఆలయానికి సమర్పిస్తూ వుంటుంది. నా మూడేళ్ళ వయసులో మా తండ్రి మరణించాడు. అప్పటినుంచి, మా ఆలనా పాలనా మా పినతండ్రిగారే చూసేవారు. అయినా, మా పినతల్లి హఠాత్తుగా చనిపోవడంతో, మా పినతండ్రికి జీవితం మీద విరక్తి పుట్టి, మమ్మల్నందరినీ వదిలి ఎటో వెళ్ళిపోయాడు. నాకు ఊహ తెలిసిన రోజునుంచి నా సంపాదనతోనే నేనూ, మా తల్లీ జీవిస్తున్నాము," అన్నాడా యువకుడు వినయంగా.

లకు కూడా వెళ్ళి ఉన్నారు. నువ్వు ఒంటరిగా యువరాణిని వెతకడానికి వెళతానంటున్నావు. అది నీ ఒక్కడివల్ల సాధ్యమయ్యే పనేనా? ఒకవేళ యువరాణిని చూసినా నువ్వు గుర్తుపట్టగలవా?" అని అడిగాడు.

ఆ యువకుడు చేతులు జోడించి, "మహారాజా! యేటా యువరాణి జన్మదిన సందర్భంగా జరిగే ఊరేగింపును నేనూ, మా తల్లీ చూసేవాళ్ళం. అందువల్ల నేను యువరాణిగారిని సులభంగా గుర్తించగలను," అన్నాడు.

"ఇంతకూ, నువ్వు ఎవరన్న సంగతి చెప్పనేలేదు!" అన్నాడు రాజు.

రాజు తల పంకించి, "అయినా, నువ్వు తలపెట్టిన కార్యం సులభమైనది కాదు. ఎన్నో కష్టనష్టాలను ఎదుర్కోవలసి వుంటుంది." అన్నాడు.

"నిజమే, మహారాజా! అవన్నీ బాగా ఆలోచించుకునే వచ్చాను. నేను యువరాణిగారిని వెతుకుతూ వెళితే, తిరిగి రావడానికి కొన్ని రోజులు పట్టవచ్చు. అక్కడ ఎదురయ్యే కష్టనష్టాల గురించి నాకు భయంలేదు. అయితే, అంతవరకు ఇక్కడ నా తల్లి సంరక్షణాబాధ్యతలు

చూసుకోవడానికి నేను తప్ప మరొక దిక్కు లేదు. అందుకే ఈ విషయాన్ని సేనాధిపతికి ముందే తెలియజేశాను,'' అన్నాడు మహేంద్రనాథుడు.

''అవును, సేనాధిపతి ఆ విషయం నాకు ముందే చెప్పాడు. ఆ సంగతి మేము చూసుకుంటాము. నువ్వు ఈ కార్యంలో విజయం సాధించావంటే నిన్ను గొప్ప బహుమతులతో సత్కరించగలము. ఇంకేదైనా కోరిక వుంటే ఇప్పుడే చెప్పు!'' అని అడిగాడు రాజు.

''ఎటువంటి బహుమతిని ఆశించిగాని నేనీ పనికి పూనుకోలేదు. ఇటువంటి క్లిష్టపరిస్థితులలో ఆదుకోవడం ప్రతి పౌరుడికీ కర్తవ్యం కదా? నాకు రాజధాని సమీప అరణ్యప్రాంత పరిసరాలు బాగా తెలుసు. అందుకే యువరాణిని వెదకడానికి మీ అనుమతి కోసం వచ్చాను,'' అన్నాడు మహేంద్రనాథుడు.

''అలాగే, నీ కోరికను అంగీకరిస్తున్నాను. ఎప్పుడు బయలుదేరుతావు?'' అని అడిగాడు రాజు.

''రేపే బయలుదేరతాను, మహారాజా! అయితే,'' అని ఆగాడు మహేంద్రనాథుడు.

''ఏమిటి?'' అన్నాడు రాజు.

ఉగ్రసేనుడు కూడా ఏమిటి అన్నట్టు మహేంద్రనాథుడికేసి చూశాడు.



''మహారాజా! నేనైతే యువరాణి గారిని గుర్తుపట్టగలను. అయితే, మీ అనుమతితోనే, నేను యువరాణిని వెతకడానికి వెళ్ళానని ఆమెకు తెలియజేయడం ఎలాగా అని ఆలోచిస్తున్నాను,'' అన్నాడు మహేంద్రనాథుడు.

''మహారాజా! యువరాణికి ఆనవాలుగా ఏదైనా ఇచ్చి పంపడం అంత క్షేమం కాదు. ఎందుకంటే అది మార్గమధ్యంలో కనిపించకుండా పోవచ్చు; దానిని ఎవరైనా దొంగిలించవచ్చు,'' అన్నాడు ఉగ్రసేనుడు.

రాజు ఉగ్రసేనుడితో, ''నిజమే. నాకూ అలాగే అనిపిస్తున్నది,'' అని, మహేంద్ర



నాధుడికేసి తిరిగి, "యువరాణి కుడి భుజం మీద ఒక పుట్టుమచ్చ ఉన్నది. అది నాకూ, మహారాణికీ తప్ప వేరెవ్వరికీ తెలియదు. నువ్వు యువరాణిని చూసినప్పుడు ఈ మాట చెప్పావంటే, ఆమె నిన్ను మేము పంపినట్టు గుర్తించగలదు. అయితే, నువ్వీ సంగతిని మూడో మనిషికి చెప్పకూడదు జాగ్రత్త!" అని హెచ్చరించి, "మీ తల్లి సంరక్షణా బాధ్యతలు సేనాధిపతి చూసుకుంటాడు. కాబట్టి, నువ్వు రేపే నిశ్చింతగా బయలుదేరవచ్చు. యువరాణిని గురించిన శుభవార్తతో నువ్వు జయప్రదంగా తిరిగి రావాలని మేమందరం ఎదురుచూస్తూ వుంటాము," అని చెప్పి ఆసనంనుంచి లేచి, అంతఃపురంకేసి బయలుదేరాడు.

సేనానాయకుడు, "సాయంకాలం, మీ తల్లిని వెంటతీసుకుని రా. మిగతా ఏర్పాట్లగురించి మాట్లాడుదాం," అన్నాడు.

మహేంద్రనాధుడు అక్కడినుంచి ఇంటికి చేరేసరికి, అతని తల్లి సాయంకాలం పూజకు పూలమాలలు సిద్ధం చేస్తున్నది.

"అమ్మా, నేను రాజుగారిని దర్శించి వచ్చాను." అన్నాడు.

"వీరసేనమహారాజుగారినా? నిజంగానా? రాజాస్థానంలో ఉద్యోగంలో చేరావా ఏం?" అని అడిగింది తల్లి ఆనందాశ్చర్యాలతో.

"ఉద్యోగంలో తరవాత చేరుతాను. ఇప్పుడు నేను యువరాణిగారిని వెతకడానికి రాజుగారు అనుమతి ఇచ్చారు!" అన్నాడు మహేంద్రనాధుడు.

"యువరాణిని వెతకడానికి నువ్వు వెళుతున్నావా? ఆమెను ఎక్కడని వెతకగలవు? ఒంటరిగా అరణ్యంలోకి వెళ్ళడం క్షేమమవుతుందా? అయినా, నువ్వు వచ్చేవరకు ఇక్కడ నన్ను చూసుకునే వాళ్ళెవరు?" అన్నది తల్లి విచారంగా.

"విచారించవద్దు! యువరాణిగారి ఆచూకీ తెలుసుకుని నేను క్షేమంగా



పరకు, మీ సంరక్షణ చూసుకునే బాధ్యత నాది. మీకు రాజభవనం నుంచే రోజూ మూడు పూటలూ భోజనం వస్తుంది. మీకు తోడుగానూ, మీ అవసరాలు చూడడానికీ ఒక సైనికుడిభార్యను పంపుతాను. కాబట్టి మీరునిశ్చింతగా వుండవచ్చు. మీ కుమారుణ్ణి వెళ్ళిరమ్మని నిండు మనసుతో ఆశీర్వదించండి,'' అన్నాడు.

ఆ తరవాత ఉగ్రసేనుడు మహేంద్రనాధుడి కేసి తిరిగి, ''మీ తల్లిని గురించిన విచారం ఇక నీకు వద్దు. అరణ్యంలో పశ్చిమదిశ నుంచి వెతకడం ప్రారంభిస్తే మంచి ఫలితం వుంటుందని వాచస్పతాచార్యులు సెలవిచ్చారు. కాబట్టి ఆ విషయాన్ని గుర్తుంచుకో. రాజుగారు చెప్పిన విషయం కూడా మరిచిపోవద్దు. రేపు పొద్దునే బయలుదేరి క్షేమంగా వెళ్ళి, విజయం సాధించుకుని రా,'' అన్నాడు.

తల్లీకొడుకులు తృప్తిగా అక్కడి నుంచి తమ ఇంటికి బయలుదేరారు.

మరునాడు తెల్లవారుజామునే లేచి, మహేంద్రనాధుడు తల్లిపాదాలకు నమస్కరించి, ఆశీర్వాదాలు పొంది, ఆమె కట్టి ఇచ్చిన అన్నం మూటనెత్తుకుని, సరోవరంకేసి నడిచాడు.

సారస సరోవరం మధ్య వున్న విడిది భవనాన్ని అతడెన్నడూ దగ్గరనుంచి చూడ

తిరిగి రాగలను. అంతవరకు నీ సంరక్షణా బాధ్యతలు రాజుగారే చూసుకుంటారు. ఈ రోజు సాయంకాలం మనం సేనాధిపతిని కలుసుకున్నామంటే, నీ అనుమానాలన్నీ తీరిపోతాయి,'' అని తల్లికి ధైర్యం చెప్పి, ఓదార్చాడు మహేంద్రనాధుడు.

సాయంకాలం, కొడుకు వెంట తనను చూడడానికి వచ్చిన మహేంద్రనాధుడి తల్లితో సేనాధిపతి ఉగ్రసేనుడుసాదరంగా, ''అమ్మా, మీ కుమారుడు ఈ కార్యంలో విజయం సాధించి, రాజకుటుంబానికీ, రాజ్యప్రజలకూ ఆనందాన్ని కలిగించగలడనే అనిపిస్తున్నది. అతడు తిరిగి వచ్చే

లేదు. అతడు ఆ భవనాన్ని చూసి, ఆశ్చర్యంచెందాడు. సరోవర పరిసర ప్రాంతాలను కలయ చూశాడు. చిన్న రేవుదగ్గర ఒక పడవ కనిపించింది. పడవ సమీపంలోని చెట్టునీడలో కూర్చుని వున్న పడవవాడు, మహేంద్రనాథుణ్ణి చూడగానే, లేచి నిలబడి, చేతులు జోడించి, ''బాబూ, తమరు రాజభవనం నుంచి వస్తున్నారా ?'' అని అడిగాడు.

''ఎందుకు అలా అడుగుతున్నావు ?'' అన్నాడు మహేంద్రనాథుడు.

''యువరాణిగారిని గురించి మంచి కబురు వస్తుందేమోనని ఎదురు చూస్తున్నాను, బాబూ. యువరాణిగారు వచ్చినా, లేదా ఫలానా చోట ఉన్నదని తెలిసినా, విడిదిభవనంలో వుండే పరిచారిక మళ్ళీ రాజభవనం చేరవచ్చు. ఆమె ఒక్కతే బిక్కుబిక్కుమంటూ విడిదిభవనంలో ఉంటున్నది. పగటి వేళ ఒకరిద్దరు పరిచారికలు వచ్చి, భోజనం ఇచ్చి వెళుతున్నారు. ఆ తరవాత ఆ ముసలిది ఒక్కతే దిగులుతో కూర్చుని ఉంటున్నది, బాబూ. అందుకే అడిగాను,'' అన్నాడు పడవవాడు.

''ఇంకా యువరాణిగారి జాడ తెలియ లేదు. ఆమెను వెతకడానికే నేను బయలుదేరాను,'' అన్నాడు మహేంద్ర నాథుడు.

''అలాగా ! చాలా సంతోషం. అయితే, ఒకటిమాత్రం నిజం. ఆ దుర్మార్గులు ఆమెను ఈ రేవుగుండా అపహరించుకుని వెళ్ళలేదు. సరోవరం నుంచి మరేదో మార్గం వుండాలి !'' అన్నాడు పడవవాడు.

''ఇప్పుడు సరోవరం చుట్టూ తిరిగి, వెలుపలికి మార్గం ఏదైనా కనిపిస్తుందేమో చూస్తాను. అరణ్యంలోకి ఏదైనా మార్గం వున్నట్టు కనిపిస్తే, ఆ దారిగుండా నా ప్రయాణం సాగిస్తాను,'' అంటూ అక్కడి నుంచి బయలుదేరాడు మహేంద్రనాథుడు.

''మీ ప్రయాణం విజయవంతం కావాలని కోరుకుంటున్నాను. వెళ్ళిరండి !'' అన్నాడు పడవవాడు. —(ఇంకావుంది)



# ఆకాశమంత పొన్నుకర్ర!

ఒకానొక పెద్ద జమీందారు ఒకసారి శాంతప్ప, వీరప్ప అనే తన విదూషకులతో ఊరి బయటకు వాహ్యాళికి బయలుదేరాడు. అక్కడ చక్కని పైరుపంటలతో కళకళలాడుతున్న పొలాలను చూసి శాంతప్ప కళ్ళు తుడుచుకుంటూ, "ప్రభూ! ఒకప్పుడు ఈ కనిపించే పొలాలన్నీ మా ముత్తాతవే!" అన్నాడు.

"అవును, ప్రభూ! మా ముత్తాత నెలకు మూడు వర్షాలు కురిపించేవాడు. అందు కాయన దగ్గిరున్న సాధనం ఏమనుకున్నారు? ఒక పెద్ద పొన్నుకర్ర! దానితో ఆయన కావాలను కున్నప్పుడు మేఘాలను అదిలించీ, బెదిరించీ వర్షం కురిపించేవాడు. అది పేరుకు పొన్నుకర్రే కాని, మరొక వజ్రాయుధం అనుకోండి," అన్నాడు వీరప్ప.

"అంత పొడవు పొన్నుకర్ర! దాన్ని మీ తాత ఎక్కడ పెట్టేవాడు?" అని అడిగాడు జమీందారు.

"ఆ పొన్నుకర్రను మా ముత్తాత, ఎవరి కంటా బడకుండా మా పొలంలో ఒక మారుమూల దాచేవాడు," అన్నాడు శాంతప్ప, ఎదురుగావున్న పచ్చటి పొలాలకేసి దీనంగా ముఖంపెట్టిచూస్తూ.

"అలాగా! అంత వజ్రాయుధానికి ఈడైన, ఆ పొన్నుకర్ర ఇప్పుడెక్కడున్నది?" అని అడిగాడు జమీందారు వచ్చే నవ్వును అపుకుంటూ.

వీరప్ప గొంతు సవరించుకుని, "ప్రభూ! మీకు తెలిసిందేగదా—అదృష్టదురదృష్టా లనేవి కావడికుండలు! కోపం చేటనీ, మీరెరిగిందే! ఒకసారి మా ముత్తాత ఇంటి గొడవలో పట్టరాని కోపంలో వుండి, మేఘాలను అదే పనిగా ఎడాపెడా అదిలిస్తూ బలంగా కొట్టాడు. దానితో మూడు పగళ్ళూ, మూడు రాత్రులూ కుండపోతగా వర్షం కురిసి, ఆ చిరుజలప్రళ యంలో పొన్నుకర్ర కాస్తా కనబడకుండా కొట్టుకు పోయింది!" అన్నాడు.

"అంతే, ప్రభూ! ఆ పొన్నుకర్ర పోయాక మా ముత్తాత అంత పొలం తనకెందుకని, అడిగినవాళ్ళకు అడిగినంత దానం చేసేశాడండి. దానితో మాతరం వచ్చేసరికి కుంటపొలం కూడా లేకుండా పోయిందండి," అన్నాడు శాంతప్ప కళ్ళు రెండూ పైపంచతో తుడుచుకుంటూ.

అంతా విని జమీందారు పొట్ట చెక్కలయ్యేలా నవ్వుకుని, విదూషకు లిద్దరికీ వందేసి ఎకరాలు బహూకరించాడు.

—యస్. లక్ష్మివిద్య






# కూబరుడికథ

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీకున్న లోకజ్ఞానం, శక్తిసామర్థ్యాలతో నిమిత్తం లేకుండా, వంశపారంపర్యంగా లభించిన రాజరికంతో నువ్వు ప్రజలను శాసించ గలవు. అయినా, నువ్వు దానితో తృప్తి పడక, ఇంత అర్ధరాత్రివేళ, ఈ భయంకరమైన శ్మశానంలో నానా యాతనలకూ గురి అవుతున్నావంటే, అందుకు కారణం ఏమైవుంటుంది? ఏదైనా సార్వభౌమత్వాన్ని ఆశిస్తున్నావా? అదే నీ కోరిక అయితే, వజ్రసంకల్పం, లక్ష్యసిద్ధిపట్ల అకుంఠిత దీక్ష కావాలి. అయితే, ఇది ఏ కొద్దిమంది మహాసత్వులకో తప్ప, అందరికీ సాధ్యపడదు. అయినా,

## బేతాళ కథలు



మీ నిర్ణయానికి కట్టుబడి వుంటాను. మన దేశానికి ఏ దేశంతో సత్సంబంధాలు వుండడం మంచిదో ఆలోచించి, ఆ దేశపు రాకుమారుణ్ణి నాకు వరుడుగా నిర్ణయిస్తే, నా వివాహంవల్ల దేశానికి ప్రయోజనం వుంటుంది,'' అన్నది.

రాజు నవ్వి, ''నీహారదేశపు యువ రాజును నీకు వరుడుగా నిర్ణయించాను. ఇష్టమేనా ?'' అన్నాడు.

స్వర్ణలత ముఖం పాలిపోయింది. నీహారదేశపుయువరాజు దుష్టుడు, నీచుడు, ప్రజాకంటకుడు. వాడు ముఖసౌందర్యం కూడా లేని కురూపి.

ఒక్కొక్క సమయంలో అలాంటివారు కూడా మానసిక బలహీనతకొద్దీ, దయ, కరుణ, ప్రేమ, జాలీలాంటి అతి సామాన్య మైన చిత్తప్రవృత్తులకు లొంగిపోతారు. ఇందుకు ఉదాహరణగా, కూబరుడనే మహామాంత్రికుడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు:

అవంతీదేశపు రాజకుమారి స్వర్ణ లతకు, అపురూప సౌందర్యవతి అన్న పేరు వచ్చింది. ఆమెను వివాహమాడగోరి వివిధ దేశాల రాజకుమారులు తమ తమ చిత్రపటాలను పంపారు. స్వర్ణలత తండ్రితో, ''నా వివాహ విషయంలో

రాజు కూతురి ముఖంలో మార్పులు గమనించి, ''నువ్వు విదేహ రాజకుమారు డైన చిత్రసేనుణ్ణి ప్రేమిస్తున్నట్లు నాకు తెలిసింది. దేశక్షేమం గురించి ఆలో చించక అతణ్ణే పెళ్ళిచేసుకుని సుఖంగా వుండు,'' అన్నాడు.

స్వర్ణలత తల అడ్డంగా ఊపి, ''నా ప్రేమ ఊహలోంచి పుట్టింది. అందుకోసం దేశక్షేమాన్ని త్యాగం చెయ్యలేను. నేను ముందుగా నా దేశాన్ని ప్రేమిస్తున్నాను. నా దేశంకోసం నేను, నీహారదేశపు యువ రాజునువివాహంచేసుకుంటాను,'' అన్నది.

రాజు మృదువుగా, ''నీ దేశాభిమానం గొప్పది. నా నిర్ణయంపై నమ్మకమూ

గొప్పదే! నీవంటి ఉత్తమురాలికి అన్యాయం జరగదని, నా విశ్వాసం. నువ్వు కోరినవాడే నీకు వరుడు కాగలడు,'' అని వెళ్ళిపోయాడు.

ఇక్కడిలా వుండగా—చిత్రారణ్యంలో కూబరుడనే మాంత్రికుడున్నాడు. వాడు క్షుద్రదేవతారాధన చేసి చాలా శక్తులు సంపాదించాడు. సమస్త భూలోకానికీ సార్వభౌముడు కావాలని వాడి కోరిక. స్వర్ణలతను వివాహం చేసుకుంటే తప్ప వాడి కోరిక సిద్ధించదని, ఒక క్షుద్రదేవత వాడికి చెప్పింది. అయితే స్వర్ణలత ఇష్టపడి వాణ్ణి పెళ్ళి చేసుకోవాలి! వాడామెను బలవంతం చేస్తే శక్తులన్నీ నశించిపోయి సామాన్యుడైపోతాడు.

కూబరుడు తన మాంత్రిక శక్తితో ఆకాశయానం చేసి, అదృశ్య రూపంలో స్వర్ణలత వుండే అంతఃపుర మందిరం చేరుకున్నాడు. ఆ సమయంలో స్వర్ణలత హంసతూలికాతల్పంమీద మైమరచి నిద్రపోతున్నది. అతి సమీపంలో వుండి ఆమె అందాన్ని చూసి దిగ్భ్రాంతుడైన కూబరుడు, ''ఇంతకాలం సార్వభౌముడు కావాలని, ఈమెను పెళ్ళి చేసుకోవాలనుకున్నాను. కాని, ఈమెను పెళ్ళి చేసుకోవడమే సార్వభౌమత్వమని ఇప్పుడు అనిపిస్తున్నది!'' అనుకున్నాడు.




స్వర్ణలత తెల్లవారుఝామున నిద్ర లేచింది. అప్పుడు కూబరుడు అదృశ్య రూపం విడిచి, ఆమెముందు ప్రత్యక్షమయ్యాడు. స్వర్ణలత అతణ్ణి చూసి కలవరపడింది. కూబరుడామెతో, ''సుందరీ! కలవరపడకు. నేను నీకు ఎటువంటి అపకారం చెయ్యను. నిన్ను ప్రేమించి ఇక్కడికి వచ్చాను,'' అంటూ తన కథ చెప్పాడు.

అంతా విని స్వర్ణలత, ''నేను రాజకుమార్తెను. రాజకుమారులలో ఒకరిని వివాహం చేసుకుంటాను. మాంత్రికుడివైన నీతో నా పెళ్ళి జరగదు కాక జరగదు,'' అని కూబరుడికి చెప్పింది.



కూబరుడు నవ్వి, ''నా శక్తి తెలియక అలా మాట్లాడుతున్నావు. ఈ అంతః పురంతో సహా నిన్ను నేను కోరిన చోటుకు తీసుకుని వెళ్ళగలను. అత్యంత బల వంతులైన రాజకుమారులను, నాకు సేవకులుగా చేసుకోగలను. నువ్వు నన్ను పెళ్ళి చేసుకుంటే ఈ ప్రపంచంలోని సమస్త సుఖాలూ నీవి. నాతో పెళ్ళికి ఇష్టపడకపోతే, నీ దేశాన్ని సర్వనాశనం చేస్తాను,'' అన్నాడు.

మాంత్రికుడన్నంత పనీ చేయగలడని స్వర్ణలత భయపడింది. ఆమె కాసేపాలో చించి, ''మూడు షరతులకొప్పుకుంటే, నేను నిన్ను పెళ్ళి చేసుకుంటాను. లేదా నువ్వు నా దేశాన్ని నాశనంచేసేలోగా, నేను ఆత్మహత్య చేసుకుంటాను,'' అన్నది.

వెంటనే మాంత్రికుడు, ''నీ షరతు లేమిటో చెప్పు!'' అన్నాడు.

''మా దేశంలోని ప్రజలు రెండు మతాలవారు. వాళ్ళు మా మతం గొప్ప దంటే మా మతం గొప్పదని, పరస్పరం కలహించుకుంటూ కాలం వృథా చేయ డమే కాక, దుష్కృత్యాలు చేస్తూ శాంతికి భంగం కలిగిస్తున్నారు. వారిలో నువ్వు మార్పు తెచ్చి సోదరభావం కలి గించాలి. ఇది నా మొదటి షరతు,'' అన్నది స్వర్ణలత.

''నీ రెండో షరతు ఏమిటి?'' అన్నాడు కూబరుడు.

''నా తండ్రి ప్రజాక్షేమాన్నాశించి ఎన్నో శాసనాలు చేశాడు. వాటిని అమలుపరచ డానికి ఎందరో రాజోద్యోగులను నియ మించాడు. కానీ వారిలో చాలామంది అవినీతిపరులై పోయారు. వారిని గుర్తిం చడం నా తండ్రికి కూడా అసాధ్యంగా వున్నది. నువ్వా అవినీతిపరులను గుర్తించి, వారిలో మంచి మార్పును తీసుకురావాలి, ఇది నా రెండో షరతు,'' అన్నది స్వర్ణలత.

కూబరుడాలోచనలో పడ్డాడు. ఈలోగా స్వర్ణలత, ''నీహారదేశపు యువరాజు

పరమ నీచుడు. వాడు నన్ను ప్రేమిం చాడు. నేను తనను పెళ్ళాడకపోతే, నా దేశాన్ని నాశనం చేస్తానని నా తండ్రిని బెదిరిస్తున్నాడు. వాడి కారణంగా నేను, నాకెంతో ఇష్టమైన విదేహ యువరాజు చిత్రసేనుణ్ణి మరిచిపోవాలనుకుంటు న్నాను. నువ్వు నీహార యువరాజులో మంచితనాన్ని ప్రవేశపెట్టాలి! ఇది నా మూడో షరతు,'' అన్నది.

ఇది విని ఉలిక్కిపడిన కూబరుడు, ''అయితే నువ్వు చిత్రసేనుణ్ణి ప్రేమి స్తున్నావన్నమాట! అలాంటప్పుడు నీ షరతులు పాటించినంత మాత్రాన ఇష్ట పడి నన్ను పెళ్ళిచేసుకుంటావా?'' అని అడిగాడు.

''నా దేశ క్షేమంకోసం, నీచుడైన ఆ నీహార యువరాజునే పెళ్ళాడ్డానికి సిద్ధ పడ్డాను. ఇన్ని మంచి పనులుచేస్తే నిన్నెం దుకు పెళ్ళిచేసుకోను?''అన్నదిస్వర్ణలత.

''సరే, నేను వెళుతున్నాను. నువ్వు నేను తిరిగి వచ్చేలోగా ఇంకెవరినీ వివాహం చేసుకోలేవు. అందుకు నీ మెడలో ఈ హారాన్ని వేస్తున్నాను. నేను తప్ప నిన్నెవరు తాకినా, ఈ హారం పామై వారిని కరుస్తుంది. అంతేకాక, నేనుతప్ప ఇంకెవ్వరూ, ఈ హారాన్ని నీ మెడలోంచి తొలగించలేరు,'' అంటూ స్వర్ణలత



మెడలో ఒక ముత్యాల హారాన్ని వేసి, అక్కడినుంచి బయల్దేరాడు.

మాంత్రికుడు ముందుగా ఉపాసనా మందిరం చేరుకుని, మొత్తం క్షుద్రదేవత లందరినీ మంత్రోచ్చారణతో పిలిచాడు. వాళ్ళందరూ ప్రత్యక్షమై, వాడి కోరిక విని, ''ఇంత వరకూ మమ్మల్నెవరూ ఇలాంటి కోరిక కోరివుండలేదు. నీ కార ణంగా మేమూ పునీతులమయ్యే అవకాశ మున్నది. మా సర్వశక్తులూ నీలో ప్రవేశ పెడుతున్నాం. కానీ నీ కార్యసాధనకు, నువ్వు ప్రేమదేవత నారాధించాలి. మా శక్తులు నీ బలాన్ని పెంచుకుంటాయి. అందువల్ల ఈ ప్రపంచంలో ఏ శక్తి



నిన్నెదిరించలేదు. అయితే, మనిషిని జయించడానికి మాత్రమే శక్తి పనికి వస్తుంది. మనసును జయించడానికి ప్రేమ అవసరం. నువ్వు గ్రహించావో లేదో—నువ్వు తలపెట్టిన కార్యం మనసుకు సంబంధించినది!'' అన్నవి.

కూబరుడు వెంటనే ప్రేమదేవతను ఆరాధించాడు. వాడు మహాశక్తిమంతుడు కావడంవల్ల, త్వరలోనే ప్రేమదేవత వాడికి ప్రత్యక్షమై, ''ప్రేమ లేనిదే నీ కోరిక తీరదు. అయితే, నువ్వు పరమ నీచుడివి; స్వార్థపరుడివి. నీలో ప్రేమ అంకురించడానికి చాలా కాలం పడుతుంది. నీ కార్యసిద్ధి కోసం, నేను నిన్నావహించి వుండగలను. ఇష్టమైతే చెప్పు!'' అన్నది.

మాంత్రికుడు సంతోషంగా అంగీకరించాడు.

ముందుగా కూబరుడు ప్రజలమధ్యకు వెళ్ళి, తాను దైవాంశ కలవాడినని చెప్పుకున్నాడు. వాడు చూపే మహిమలు ప్రజలనెంతగానో ఆకర్షించాయి. కొద్ది రోజుల్లోనే ఎందరో వాణ్ణి నమ్మి భక్తులు కాసాగారు.

కూబరుడు చాలా మంచి పనులు చేశాడు. ఎందరికో అసాధ్యమైన వ్యాధులను నయం చేశాడు. గుడ్డివారికి చూపు తెప్పించాడు. పేదవాళ్ళకు డబ్బిచ్చాడు. బీడువారినపొలాల్లోపంటలు పండించాడు.

తర్వాత కూబరుడు, దేవుడి గురించిన ప్రచారం ప్రారంభించాడు. ఏ మతం వారికా మతం నమ్మే రూపంలో కనిపించి, ''మీరు నమ్మే దేవుడి పేరేమయినా, మీరంతా సోదరులు. మీరు పరస్పర ద్వేషంతో ఒకరినొకరు నాశనం చేసుకుంటూంటే చూస్తూ నేను భరించలేను. నాకు దుఃఖం కలిగించే పనులు మీరు చేయకండి!'' అని చెప్పాడు.

క్రమంగా ప్రజల్లో మార్పు రాసాగింది. అవంతీ దేశంలో మతవిద్వేషాలు నశించడమే కాక, కూబరుడికి భక్తులైన

వారందరూ అవినీతిని విడిచిపెట్టారు. రాజోద్యోగులందరూ కూబరుడి చెంత చేరి తమ పాపాలు కడిగేసుకుని కొత్త జీవితం ప్రారంభించారు.

ఇది జరిగాక కూబరుడు వివిధ రాజ్యాల్లో సంచారం చేశాడు. ఎక్కడకు వెళ్ళినా భక్తి ప్రేమభావాలతో ప్రజలు వాడిముందు సాగిలపడసాగారు. ఆ విధంగా పరమ దుష్టుడైన నీహారదేశపు యువరాజు కూడా కూబరుడి భక్తుడై సన్మార్గంలో ప్రవేశించాడు.

అనుకున్న దానికంటే ముందుగానే, కూబరుడు అసాధ్యమనుకున్నవన్నీ సాధించి, స్వర్ణలతవద్దకు తిరిగివచ్చాడు.

ఆమె వాడిముందు సాష్టాంగపడి, "నువ్వు మాంత్రికుడివి కాదు, దేవుడివి. నాకోసం ఇన్ని సాధించడం మానవమాత్రులకు సాధ్యంకాదు. నువ్వు నన్ను పెళ్ళిచేసుకుంటే అది నా అదృష్టంగా భావిస్తాను," అన్నది.

కూబరుడు నవ్వి, "నేను నిన్ను పెళ్ళాడాలని రాలేదు. నీ మెడలోని హారాన్ని తొలగొంచి, నిన్ను స్వతంత్రురాలిని చేయాలని వచ్చాను," అన్నాడు.

స్వర్ణలత ఆశ్చర్యంగా, "అయితే, నువ్వు నన్ను ప్రేమించడం లేదా?" అని అడిగింది.



కూబరుడు గంభీరంగా, "మాంత్రికుడిగా నిన్ను ప్రేమించినప్పుడు నిన్ను పెళ్ళి చేసుకోవాలనుకున్నాను. ఇప్పుడు నేను దైవాంశ కలవాణ్ణి. అందువల్ల నిన్ను కోరను. నీ ప్రేమకు న్యాయం జరగాలని కోరుకుంటాను. నువ్వు విదేహ యువరాజు చిత్రసేనుణ్ణి వివాహం చేసుకుని సుఖంగా జీవించు," అని స్వర్ణలత మెడలోని ముత్యాలహారం తీసుకుని, అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, ఎన్నో శ్రమలకోర్చి క్షుద్రదేవతలను ప్రత్యక్షం చేసుకుని, సమస్త భూలోకానికి సార్వభౌముడు కాదలచిన కూబరుడు,

అది సాధ్యమయ్యే తరుణంలో, ఎందుకు చేజేతులా జారవిడుచుకున్నాడు? తను దేవాంశ కలవాణ్ణని వాడనడం, అజ్ఞాన జనిత అహంకారం కాదా? ఒకవేళ అది కాదనుకుంటే—స్వర్ణలత పెట్టిన షరతులను సాధించే ప్రయత్నంలో, వాడు తను మహామాంత్రికుడినన్న సంగతి మరిచి, ప్రేమా, సోదరభావంలాంటి పేలవమైన శబ్దాలను వల్లిస్తూ, అతి సామాన్యుడైన మనిషి దశకు దిగజారిపోయాడా? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''కూబరుడు స్వార్థాన్నీ, అధికారాన్నీ ప్రేమించినవాడు. అందువల్ల, వాడారాధించినవారు క్షుద్ర దేవతలయ్యారు; శక్తులు క్షుద్రశక్తులయ్యాయి. కానీ వాడు స్వర్ణలతను ప్రేమించాక, వాడి దేవత ప్రేమదేవత అయింది. వాడి శక్తులు దైవమహిమలయ్యాయి. అది గ్రహించే వాడు, తను దేవాంశ కలవాణ్ణని అన్నాడు. అందులో అజ్ఞానం గానీ, అహంకారం గానీ ఏమీ లేదు. అల్పులూ, శక్తిహీనులూ చిలక పలుకుల్లా పలికే దయ, కరుణ, జాలి, ప్రేమలాంటి మాటలకు కారణం మానసిక బలహీనత కావచ్చు. కానీ వాటిని మహాశక్తిమంతులైన కూబరుడిలాంటి వాళ్ళకు ఆపాదించడం అర్థరహితం, హాస్యాస్పదం అవుతుంది. క్షుద్రశక్తుల నారాధించి సమస్త భూలోకానికీ సార్వభౌముడు కావాలని ఆశించిన తరుణంలో, కూబరుడు కేవలం క్షుద్రమాంత్రికుడు. ఆ తర్వాత స్వర్ణలత షరతులను సాధించే ప్రయత్నంలో వాడి ప్రవృత్తి పూర్తిగా మారిపోయింది. ఆ కారణంగానే వాడు, స్వర్ణలతను పెళ్ళాడేందుకు తిరస్కరించాడు!'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు.-(కల్పితం)

[ఆధారం : "వసుంధర" రచన]



# చందమామ అనుబంధం—46




మనదేశపు పక్షులు-జంతువులు :

## నల్లజింకలు

మనదేశంలో ముఖ్యంగా నాలుగు రకాల జింకలు ఉన్నాయి. అవి చింకారా జింకలు, 'బ్లాక్ బక్' అనే నల్లజింకలు, చౌసింఘా అనే నాలుగు కొమ్ముల జింకలు, నీల్‌గాయ్ అనే నీలిరంగు జింకలు. ఈ నాలుగు రకాలలో అన్నిటికన్నా అందమైనవి నల్లజింకలు. ఇవి మన దేశంలోని 'యాంటిలోప్ సెర్వియాకోప్ర' అనే జాతికి చెందిన జింకలు. శరీరమంతా నలుపు, తెలుపు మచ్చలతో నిగనిగలాడుతూ వుండడం ఈ లేళ్ళ ప్రత్యేకత. మగజింకల కొమ్ములు నుడులు తిరిగి వుంటాయి. భుజాలవరకు 80 సెం. మీ. ఎత్తు కలిగిన ఈ జింకలు 40 కి. గ్రా. బరువు వుంటాయి. వీటికి శక్తివంతమైన కంటిచూపు వుంటుందిగాని, ఘ్రాణశక్తి, వినికిడిశక్తి మాత్రం తక్కువ!

ఒకప్పుడు మన దేశమంతటా నివసించిన ఈ జంతువులు ప్రస్తుతం గుజరాత్, రాజస్థాన్, పంజాబు ప్రాంతాలకే పరిమితాలై పోయాయి. దక్షిణ భారతదేశంలో ఇవి మద్రాసులోని 'గిండి నేషనల్ పార్క్'లో ఉన్నాయి. 1924 వ సం॥లో ఆనాటి గవర్నర్ వీటిని అక్కడ ప్రవేశపెట్టారు. ఈ లేళ్ళు వింతగా గంతులు వేస్తూ అతి వేగంగా పరిగెత్తే దృశ్యం కనులవిందు చేస్తుంది.

# కథలు చెప్పడంలో నేర్పరి!



మద్రాసులోని ఒక సుప్రసిద్ధ పత్రిక ఇటీవల పిల్లలకు కథలు చెప్పే పోటీని నిర్వహించింది. ఆ పోటీలో దాదాపు 100 మంది పిల్లలు పాల్గొన్నారు. మొదటి వడబోతలో యాభై మంది మిగిలారు. వారిలో పద ముగ్గురిని కథలు చెప్పడంలో నేర్పరులుగా భావించి బహుమతులు ఇచ్చారు. అలా బహుమతి పొందిన వారిలో ఐదేళ్ళ దీపక్ శ్రీనివాసన్ ఒకడు.

అంతేకాదు; ఆ పోటీలో పాల్గొన్న ఒకే ఒక 'స్పాస్టిక్స్ చైల్డ్' దీపక్. అంటే-పుట్టుకతో వచ్చిన నరాల బలహీనత కారణంగా సరిగ్గా మాట రానివాడు!

ఈ నరాల బలహీనత కారణంగా సరిగ్గా మాట్లాడడానికే ఇబ్బంది పడే దీపక్—తను పెద్దల నుంచి విన్న తెనాలి రామకృష్ణ కథలనూ, బీర్బల్ కథలనూ అద్భుతంగా వివరించి న్యాయనిర్ణేతలను మెప్పించాడు.

'స్పాస్టిక్స్ సొసైటీ ఆఫ్ ఇండియా' ఆధ్వర్యంలో మద్రాసులో నడుపుతూన్న ప్రత్యేక 'విద్యా కేంద్రం'లో శిక్షణ పొందుతూన్న వాళ్ళలో దీపక్ చాలా ప్రత్యేకమైనవాడుగా చెబుతున్నారు. దీపక్ రోజూ ఆ విద్యాకేంద్రానికి వెళుతూ, అక్కడ శిక్షణ పొందుతున్నాడు. అప్పుడు ఆ కుర్రాడి మొహంలో విమాత్రం విసుగూ, బాధా కనిపించడం లేదు. ఎప్పుడు చూసినా నవ్వుతూ వుంటాడు.

దీపక్ ఇంటివద్ద టి వి చూడడానికి, ముఖ్యంగా సినిమా పాటల కార్యక్రమాలు చూడడానికి ఇష్ట పడతాడు. వారం వారం ప్రసారమయ్యే ప్రపంచ వార్తలు—'వరల్డ్ దిస్ వీక్' కార్యక్రమాన్ని చూడడమే కాదు; ఆ తరవాత కొన్నాళ్ళకు ఆ వార్తలను వరుసక్రమంలో చెప్పగల అద్భుతమైన జ్ఞాపకశక్తి దీపక్‌కు ఉన్నది. తమ ఇంటికి తరచూ వచ్చే బంధుమిత్రుల పేర్లూ, చిరునామాలూ మాత్రమే కాదు, వాళ్ళ టెలిఫోన్ నెంబర్లు కూడా సునాయాసంగా చెప్పకలుగుతున్నాడీ ఐదేళ్ళ కుర్రాడు. క్రికెట్, టెన్నిస్, ఫుట్‌బాల్ అంటే చాలా ఇష్టపడతాడు. కపిల్‌దేవ్ ఈ పసివాడి అభిమాన క్రీడాకారుడు.

చురుకైన చూపులతో కనిపించే దీపక్‌కు దురదృష్టవశాత్తు చేతులతో రాయడానికి సాధ్యం కాదు. కాని, రాయగలిగితే మాత్రం చక్కటి కథలు రాసి పత్రికలకు పంపేవాడే!

# మీకు తెలుసా?

1. మొట్టమొదటి 'సాహితీసదస్సు' ఏ నగరంలో జరిగింది ?
2. హిందీభాషలో మొట్టమొదట రామాయణాన్ని రచించినవారెవరు ?
3. కలకత్తాలోని 'బొటానికల్ గార్డెన్స్' ప్రత్యేకత ఏమిటి ?
4. ఒక పర్షియను గాథలో తండ్రీ కొడుకులు ఒకరితో ఒకరు యుద్ధానికి దిగి, తాము ఎవరని గ్రహించేలోగానే ఇద్దరూ మరణిస్తారు. వారెవరు ?
5. మన తొమ్మిదవ లోక్‌సభ ఎన్నికలకు ఒక ప్రాముఖ్యత ఉన్నది. ఏమిటది ?
6. జవహర్‌లాల్ నెహ్రూ కాంగ్రెస్ అధ్యక్ష పదవీబాధ్యతలను ఎన్నిసార్లు నిర్వహించారు ?
7. ఇంగ్లీషు భాషకు అక్షరాలు 26. మరి రెండు యూరోపియన్ భాషలకు కూడా ఇరవై ఆరు అక్షరాలే ఉన్నాయి. అవి ఏవి ?
8. ఢిల్లీ సుల్తాను ఒకరు 'పోలో' ఆట ఆడుతూ మరణించారు. ఆయన ఎవరు ?
9. రాజా రంజిత్‌సింగ్ అభిమానించిన గుర్రం పేరేమిటి ?
10. గంగా–యమునలతో పాటు 'కుంభమేలా' లతో సంబంధం గల నదులు ఏవి ?
11. శిక్కులు, ఇద్దరు గురువుల జన్మదినోత్సవాలను ఘనంగా జరుపుకుంటారు. వారెవరు ?
12. 'బుల్‌ఫైట్' లో 'మెటాడర్' (విజేత) కు ఇచ్చే అత్యున్నతమైన బహుమతి ఏమిటి ?
13. బెంగుళూర్‌లోని 'శాశ్వతి మ్యూజియం' ప్రత్యేకత ఏమిటి ?
14. ఇండియాలో మొట్టమొదటి 'ఆర్చ్‌బిషప్' ఎవరు ?

## సమాధానాలు

1. మదురై; తమిళసంఘం.
2. తులసీదాసు; రామచరిత్ మానస్.
3. ఆసియాలోకెల్లా పెద్దది.
4. రుస్తుమ్–సోహరాబ్.
5. వయోజన ఓటు హక్కును 18 కి తగ్గించారు. మొట్టమొదటిసారిగా, ఏ పార్టీకిగాని మెజారిటీ రాని 'హంగ్' పార్లమెంటు ఏర్పడింది.
6. ఏడు సార్లు.
7. జర్మన్, డచ్.
8. కుతుబుద్దీన్ ఐబక్.
9. లాయిలీ.
10. నర్మద, కావేరీ, గోదావరి.
11. గురు నానక్‌దేవ్, గురు గోవింద్‌సింగ్.
12. ఆబోతు రెండు చెవులూ, తోక.
13. స్త్రీలను గురించి మన దేశంలో ఏర్పరచిన మొట్టమొదటి మ్యూజియం.
14. బిషప్ జువాన్ డీ అల్బూకెర్క్.

# చందమామ కబుర్లు

## రికార్డు సృష్టించిన ధర!

అరుదైన స్టాంపులు మంచి ధరకు అమ్ముడవుతాయి. ఇంగ్లాండు రాజు ఏడవ ఎడ్వర్డ్ తలబొమ్మ కలిగిన 1904 వ సం॥నికి చెందిన ఒక స్టాంపు ఇటీవల 56,000 అమెరికా డాలర్లకు అమ్ముడయింది. 20 వ శతాబ్దంలో ఎక్కువ ధర పలికిన ఈ ఉదారంగు బ్రిటిష్ స్టాంపును స్విట్జర్లాండుకు చెందిన ఒక 'స్టాంప్ కలెక్టర్' కొనుక్కున్నాడు.






## చాలాకాలం వెలిగే బల్బు!

కాలిఫోర్నియాలోని ఒక కంపెనీ, అనేక సంవత్సరాల పరిశోధనలు జరిపి 20,000 గంటలసేపు వెలిగే ఎలెక్ట్రిక్ బల్బును రూపొందించింది. ఎలక్ట్రానిక్ లైట్, ఇ-ల్యాంప్ అని పిలువబడే ఈ బల్బు రోజుకు 3 గంటల ప్రకారం అయితే 18 సంవత్సరాలు వెలుగుతుందన్నమాట।

## సూయెజ్ కాలువ

మధ్యధరాసముద్రాన్నీ, ఎర్ర సముద్రాన్నీ కలిపే సూయెజ్ కాలువ లోతు 18 మీటర్లు. ఈ లోతును 22 మీటర్లు చేసే పథకాన్ని చేపట్టి పని ప్రారంభించారు. ఈ పథకం పూర్తయినట్టయితే, ఇంకా కొన్ని ఓడలు ఆఫ్రికా తీరాన్ని చుట్టుకుని వెళ్ళవలసిన అవసరం లేకుండా తిన్నగా వెళ్ళడానికి అవకాశం ఏర్పడుతుంది. ఈ ఆధునికీకరణ పథకంవల్ల ప్రపంచం మొత్తంమీద దాదాపు 90 శాతం వాణిజ్యనౌకలు ప్రయోజనం పొంద గలవని భావిస్తున్నారు.






# ఉదారబుద్ధి

రంగాపురం అనే గ్రామానికి, సుందరం అనే యువకుడు ఉపాధ్యాయుడుగా వచ్చాడు. ఆ గ్రామాన్ని గురించిగానీ, అక్కడి ప్రజలను గురించిగానీ అతడి కేమీ తెలియదు. గ్రామం చేరుతూనే అతడు, ఆ ఊరి జమీందారును కలుసుకుని, తనను పరిచయం చేసుకున్నాడు. జమీందారు, అతడికి వుండేందుకు మంచి ఇల్లూ ఇతర సాకర్యాలూ ఏర్పాటు చేయించాడు. సుందరానికి, జమీందారు చాలా మితభాషిగానూ, గంభీరంగానూ కనిపించాడు.

సుందరం వచ్చిన వారం రోజులకు వినాయకచవితి వచ్చింది. అయితే, తెల్లవారితే పండగ అనగా, హఠాత్తుగా ఆకాశం నిండా మేఘాలు కమ్మి కుంభవృష్టి మొదలయింది. బాగా తెల్లవారిం తర్వాత కాస్త వాన తగ్గినా వీధులన్నీ జలమయం అయిపోయాయి. అయినా, పండగ గనక వీధులన్నీ క్రమంగా జనంతో క్రిక్కిరిసిపోయాయి.

వీధులవారగా పువ్వులూ, పత్రీ, మట్టి వినాయకుడి లాంటివి అమ్ముకునేవాళ్ళు, చలికి వణుకుతూ, వానను తిట్టుకుంటూ కూర్చున్నారు. పాలవెల్లులకు తాళ్ళు పేని అమ్ముకునే పసివాళ్ళు సైతం చలికి వణుకుతూ, కొనేవాళ్ళ కోసం ఆశగా చూడసాగారు.

వినాయకుడి పూజకు పువ్వులూ, పత్రీ కొనేందుకు సుందరం వీధిలోకి వచ్చాడు. పదేళ్ళు నిండని పసివాళ్ళు, అరవైఏళ్ళు దాటిన వృద్ధులు ఆశగా, ఆరాటంగా అరుస్తూ వస్తువుల్ని అమ్మజూపడం అతడి కంటబడింది. ఒకచోట జమీందారు గొడుగు వేసుకుని స్వయంగా అక్కడికి వచ్చి, పాలవెల్లులకు తాళ్ళు అమ్మే ఒక

రావినూతల సువర్నాకన్నన్



కుర్రవాడి దగ్గిర నిలబడి బేరం అడుతున్నాడు. ఇది చూసి సుందరానికి ఆశ్చర్యంతోపాటు మనసులో బాధ కూడా కలిగింది.

జమీందారు, కుర్రవాడు చెప్పిన ధరకు చాలా తగ్గించి అడుగుతున్నాడు. తర్వాత పత్రీ, పువ్వులూ అమ్మేవాళ్ళ దగ్గిర కూడా జమీందారు అదే విధంగా బేరం ఆడసాగాడు. ఇది గమనించిన సుందరానికి, జమీందారు మీద చాలా ఏహ్య భావం కలిగింది.

జమీందారు ఆ విధంగా కొసరికొసరి బేరమాడి, అక్కడ వున్నవాళ్ళు తెచ్చిన వన్నీ కొనేశాడు. ఆ వెంటనే ఆయన నౌకర్లు వాటన్నిటినీ బుట్టల్లోకి ఎత్తుకుని దివాణానికి వెళ్ళిపోయారు.

పసివాళ్ళనీ, ముసలివాళ్ళనీ అయినా చూడకుండా, అలా బేరమాడి అన్నీ కొని జమీందారు ఏం చేసుకుంటాడో, సుందరానికి అర్థం కాలేదు. బహుశా, వాటిని కొంచెం లాభానికి తన నౌకర్లచేత, ఇతరులకు అమ్మిస్తాడేమో అనుకున్నాడు, సుందరం.

ఆసమయంలో,వినాయకపూజా సామగ్రి కొనేందుకు, అక్కడికి సుందరంతో పాటు పని చేసే ఉపాధ్యాయుడొకడు వచ్చాడు.

సుందరం, అతడికి తను చూసింది చెప్పి, "వీళ్ళందరూ జమీందారుకు భయపడి, ఆయన అడిగిన ధరకు తమకు గిట్టుబాటు కాకపోయినా ఇచ్చేసివుంటారు. చూడబోతే జమీందారు కర్కోటకుడిలా వున్నాడు! వీళ్ళందరూ చలికి వణుకుతూ, పొట్టకోసం ఇలా వీధిలో కూర్చుని వుంటే, మానవత్వం అన్నది మరిచి, అలా గీసిగీసి బేరమాడి కొనడం ఏమిటి?" అన్నాడు ఆవేశంగా.

సుందరం మాటలకు ఉపాధ్యాయుడు నొచ్చుకుని, "జమీందారుగారి గురించి అలా అవమానకరంగా మాట్లాడకండి. మీకు తెలియదు, ఆయన దేవుడి లాంటి మనిషి," అన్నాడు.

"నాకు తెలియదు. దేవుడి లాంటి మనిషి ప్రవర్తన ఇలా వుంటుందన్న మాట!" అన్నాడు సుందరం అవహేళనగా.

ఉపాధ్యాయుడు ఏదో అనబోయి ఆగి, "సరే, నాతో రండి. ఒకసారి జమీందారు గారి ఇంటికి వెళ్ళి వద్దాం," అంటూ ముందుండి, దారి తీశాడు.

వాళ్ళు వెళ్ళేసరికి జమీందారు, నౌకర్లచేత తను కొన్న పువ్వులూ, పత్రీ లాంటివి, ఒక ఎత్తయిన అరుగు మీద గుట్టలుగా పోయిస్తున్నాడు.

ఆయన సుందరం వాళ్ళను చూసి ఆప్యాయంగా పలకరించి, "అనుకోకుండా పండగపూట అతిథులొచ్చారు!" అని నౌకర్లచేత కొత్తబట్టలు తెప్పించి, "బాగా తడిసిపోయినట్టున్నారు. తలలు తుడుచుకుని ఇవి కట్టుకోండి," అన్నాడు.

సుందరం, జమీందారు కేసి అయోమయంగా చూసి, తోటి ఉపాధ్యాయుడితో పాటు పక్కనున్న గదిలోకి వెళ్ళి, కొత్త బట్టలు కట్టుకుని రాగానే, జమీందారు వాళ్ళను కూర్చోమని, నౌకరుచేత వాళ్ళకు వేడివేడి పాలు తెప్పించి ఇచ్చాడు.

ఆ సమయంలో జమీందారు ఉదార ప్రవర్తనకు ఎంతగానో ఆశ్చర్యపోయిన సుందరం, ఆయనతో, "అయ్యా, తమరు



అన్యథా భావించకపోతే, నేను ఒక చిన్న సంశయం గురించి తమకు మనవి చేయదలిచాను," అన్నాడు ఎంతో వినయంగా.

"ఏమిటా సంశయం? నేనేం అనుకోను. దాపరికమెందుకు, అడగండి!" అన్నాడు జమీందారు చిరునవ్వుతో.

అప్పుడు సుందరం పూలూ, పత్రీ అమ్మేవాళ్ళతో జమీందారు ప్రవర్తించిన తీరు గురించి చెప్పి, "వాళ్ళతో అతి గిజినపట్టుగా బేరాలాడిన ఆ జమీందారు గారూ, తమరూ ఒకరేనా, అన్నంత సంశయం కలుగుతున్నది నాకు, క్షమించాలి!" అన్నాడు.

ఈసారి జమీందారు పెద్దగా నవ్వి, "మనిషిని మనిషి ఆదుకోవడం న్యాయమే నంటారా?" అని అడిగాడు.

"ఇది ఆదుకోవడమా!" అన్నాడు సుందరం విస్తుపోతూ.

"మరి, ఆదుకోవడమే గదా. ఈ వాన మునురులో వాళ్ళు ఎంతో దూరం నుంచి శ్రమపడి తెచ్చిన పూలూ, పత్రీ ఎలా అమ్ముడుపోతాయి? ఆ కారణంగానే, వాళ్ళు తెచ్చినవాటిల్లో ఎక్కువ భాగం నేనే కొని, మా నౌకర్లకూ, ఇరుగుపొరుగు వాళ్ళకూ ఇవ్వదలిచాను," అన్నాడు.

"ఇంత దానగుణం వున్న తమరు, చిన్న పిల్లల దగ్గిర కూడా బేరం ఆడి కొనడం ఎందుకు? ఏదో కొంత డబ్బిచ్చి, వాళ్ళకు సాయపడవచ్చు గదా?" అన్నాడు సుందరం.

ఇందుకు జమీందారు తల అడ్డంగా తిప్పి, "ఇవ్వవచ్చు, కానీ ఇవ్వను! మీరు కొత్తగా మా గ్రామం వచ్చిన ఉపాధ్యాయులు గనక, కొంత వివరంగా చెబుతాను. వినాయకచవితి రోజుల్లో, ఈ ప్రాంతాల ఎంతో కొంత వాన కురవడం అన్నది పరిపాటే. ఇది ఎరిగినవాళ్ళు గనక, తాము తెచ్చే పూలూ, రకరకాల పత్రీ అమ్మకం కాకుండా మిగిలిపోదనీ, ఏదో ధరకు జమీందారుగారు కొంటారనీ, వాళ్ళ నమ్మకం. అందుకే, ఏదైనా పెద్ద వర్షం కారణంగా, అవన్నీ కొనుగోలుకాని పరిస్థితి ఏర్పడితే, నేనే బేరం ఆడినట్టు నటించి కొనేస్తాను. అలా కాక ఉట్టినే డబ్బిస్తానంటే, వాళ్ళు సోమరిపోతుల్లా తయారవుతారు. కోరి సోమరిపోతుల్ని తయారు చేయడం కన్న మించిన పాప కార్యం లేదని, నా నమ్మకం. మీరు ఉపాధ్యాయులు! ఆలోచించి చూడండి," అన్నాడు శాంతంగా.

దానితో సుందరానికి, జమీందారు ప్రవర్తనలోని ఆంతర్యం, ఆయన ఉదార బుద్ధీ అర్థమైంది. అతడు రెండు చేతులూ జోడించి ఆయనకు నమస్కరించాడు. జమీందారు, అతడి వెన్నుకట్టి నవ్వేశాడు.





# భక్తుడైన దొంగ

రహీం అనే ధనవంతుడికి ఒక్కగాను ఒక్క కూతురు రజియా చాలా అందమైనది. రహీంకు గల ఆస్తి పది తరాల పాటు తిన్నా తరిగేది కాదు.

రహీం దైవభక్తి గలవాడు. అతని దినచర్య ఐదుపూటలా నమాజ్ చేయటమూ, ఖురాన్ చదవటమూనూ. అల్లా పేరిట తన ప్రాణాన్నయినా ఇచ్చేటంతటి దైవభక్తి గలవాడు అతను.

రజియాకు యుక్తవయసు రాగానే ఎంతో మంది ధనవంతులు ఆమెను వివాహమాడేటందుకు ప్రయత్నించారు. కాని వారిలో దైవభక్తి కలవాడు ఒక్కడూ కనిపించలేదు రహీంకు. అయన తన కుమార్తెను దైవభక్తిగలవాడికే ఇయ్యాలని నిర్ణయించుకున్నాడు.

ఒకరోజు రాత్రి రహీం భార్య సుల్తానా తన భర్తతో, ''చూడండి, మన అమ్మాయికి ఎన్నో మంచి సంబంధాలు వస్తున్నాయి. ఎంతోమంది ధనవంతులు వస్తున్నారు. కాని మీకు ఒక్క సంబంధమూ నచ్చలేదు. ఇలా అయితే అమ్మాయికి వివాహం ఎలా అవుతుంది?'' అని ఎంతో దిగులుతో అన్నది.

''పిచ్చిదానా, మనకు కావలసినంత ధనం ఉన్నది. మన అమ్మాయిని ధనవంతుడికి ఇయ్యాలన్న కోరిక నాకు లేదు. బీదవాడయినప్పటికీ, బుద్ధిమంతుడూ, దైవభక్తి గలవాడూ అయినవాడి కోసం చూస్తున్నాను. అల్లా కృపవల్ల నా కోరిక ఫలించకపోదు,'' అన్నాడు రహీం తన భార్యతో.

ఆ రాత్రి రహీం ఇంట దొంగతనం చెయ్యటానికి వచ్చిన నసీర్ అనే వాడు భార్యాభర్తల సంభాషణ అంతా విన్నాడు. మర్నాడు ఉదయం, వాడు రహీం

అరేబియా జానపద కథ



నమాజ్‌కని మసీదుకు వెళ్ళే సమయం గమనించి, అతని కన్న ముందే అతను మసీదు చేరి, వచ్చీరాని నమాజ్ చదువుతున్నట్టు నటించసాగాడు.

రహీం తాను మసీదుకు వచ్చినప్పుడల్లా ఆ దొంగ ఎంతో భక్తితో నమాజ్ చేస్తూండటమూ, మసీదులోనే పడుకుంటూ ఉండటమూ గమనించి, నసీర్‌ను, "మీదే వూరు, నాయనా? పదిరోజులుగా నువ్వు మసీదులోనే గడపటం చూస్తున్నాను," అని అడిగాడు.

అందుకోసమే ఎదురుచూస్తున్న దొంగ, "నాకు ఒక ఊరని ఏమీ లేదండి. నాకు తల్లీ, తండ్రీ, లేరు. అల్లాను ధ్యానిస్తూ రోజులు గడపటమే నా పని," అన్నాడు వినయంగా.

"అయితే నువ్వు ఎక్కడ భోజనం చేస్తున్నావు?" అని రహీం అడిగాడు.

"భగవంతుణ్ణి ధ్యానిస్తూ ఉంటే నాకు ఆకలి, దప్పి తెలియదు. ఏ రాత్రికో ఆకలి అనిపిస్తే, అల్లా కృప వల్ల ఎవరో ఒకరు నా ఆకలి తీర్చుతున్నారు. దైవ భక్తే చాలు నా కడుపు నిండటానికి," అని నసీర్ బొంకాడు.

నిజానికి, ఎప్పుడూ మసీదులోనే ఉంటున్నాడనీ, పుణ్యాత్ముడనీ, ఊరివాళ్ళు అతనికి తినటానికి ఏదో ఒకటి పంపుతూనే ఉన్నారు.

దొంగ మాటలు రహీం నమ్మి, నిజమైన దైవభక్తి అంటే అతనిదే అనుకున్నాడు. "ఇంత చిన్న వయసులో ఎంత దైవభక్తి! పైగా అందగాడూ, బుద్ధిమంతుడూనూ. అల్లా కృప వల్ల ఈ నాటికి నా కోరిక తీరింది. నా కుమార్తెకు తగిన భర్త ఇతనే! ఇతనికే పిల్లనిచ్చి చేస్తాను," అని రహీం నిశ్చయించుకున్నాడు. ఆయన దొంగకు రోజూ తన ఇంటి నుంచి పంచ భక్ష్య పరమాన్నాలు పంపించసాగాడు.

ఇలా నలభై రోజులు గడిచేసరికి దొంగ నిజంగానే దైవభక్తిలో లీనమయ్యాడు. రహీం పంపే తిండి తింటూ, రోజూ దైవ

ప్రార్థన చేస్తూ, పెద్దలు చెప్పే నీతి బోధలు వింటూంటే అతనిలో నిజంగానే మార్పు వచ్చింది. అతనికి తాను గడుపుతున్నదే ఉత్కృష్ట జీవితం అనిపించింది. అతను తాను చేసిన దొంగతనాలూ, పాపాలూ తలుచుకుని, ధ్యానంలో ఉన్నప్పుడు ఏడ్చేవాడు.

రహీం ఒక రోజు అతనితో, "నాయనా, నిన్ను చూస్తూంటే నాకెంతో సంతోషంగా ఉన్నది. నీలాటి భక్తుడి కోసమే చూస్తూ, ఇన్నాళ్ళూ నా కుమార్తెకు వివాహం చెయ్యలేదు. నువ్వు నా కుమార్తెను చేసుకుంటే సంతోషిస్తాను," అన్నాడు.

ఈ మాటలు వినగానే దొంగ, రహీం కాళ్ళ మీద పడి ఏడుస్తూ, "నన్ను క్షమించండి. బాబూ, నేను దొంగను. ఒక రోజు మీ ఇంటికి దొంగతనానికి వచ్చి, మీ భార్యాభర్తల సంభాషణ విని, మిమ్మల్ని మోసం చేసి మీ కుమార్తెను వివాహమాడాలన్న దురుద్దేశంతో, మీరు మెచ్చుకోగలందులకు దైవభక్తి నటించాను. కాని ఈ నలభైరోజుల భక్తితో నేనెంతో మారాను. ఇక ఎప్పుడూ దొంగతనాలు చెయ్యను. కష్టపడి జీవిస్తాను. నా జీవితమంతా అల్లా సన్నిధిలో గడిపేస్తాను. మీ కుమార్తెకు నేను తగినవాణ్ణి కాను. ఆమెను పెళ్ళాడాలన్న దురాశ ఇప్పుడు నాకు లేదు. మిమ్మల్ని మోసం చేసినందుకు నాకు మీరు ఏ శిక్షవిధించినా అనుభవించటానికి సిద్ధంగా ఉన్నాను," అన్నాడు.

రహీం ఈ మాటలు విని నిర్ఘాంతపోయి, తేరుకుని, "పిచ్చివాడా! తెలియక అజ్ఞానంలో ఏదో చేశావు. పాపం చేస్తే భగవంతుడు క్షమించడన్న జ్ఞానం ఇప్పుడు నీకు కలిగింది. అల్లా నా కుమార్తె కొరకే నిన్ను పంపాడు. మీ కిద్దరికీ నేను వివాహం చేస్తాను," అన్నాడు.

రజియాకూ, నసీర్‌కూ అతివైభవంగా వివాహం జరిగింది. నసీర్ నిజాయితీగా ఉంటూ, మామకు తగ్గ అల్లుడనిపించుకున్నాడు.



# మాటనేర్పు

గన్నవరంకొండ అనే పెద్ద గ్రామంలో, వీరాస్వామి అనే అతను, నాలుగు దారులు కలిసే కూడలిలో చెప్పుల దుకాణం ఒకటి పెట్టాడు. మొదట్లో అతడి దుకాణానికి చాలామంది చెప్పులు కొనేందుకు వచ్చేవాళ్ళు. కాని, ఎవరికీ ఏ చెప్పుల జతా నచ్చేదికాదు. చెప్పులు వదులుగా వున్నాయనో, లేక మరీ బిగువుగా వున్నాయనో చెప్పి, వెళ్ళిపోతూండేవాళ్ళు.

ఈ స్థితిలో ఒకనాడు వీరాస్వామి బాగా ఆలోచించి, ఏదో తిరుగులేని ఉపాయం తోచినవాడిలా ఆనందపడిపోతూ, మర్నాడు ఉదయం దుకాణం తెరిచాడు.

కొద్దిసేపటి తర్వాత ఒక ఆసామీ వచ్చి, ఒక చెప్పుల జత తొడిగిచూసి, "ఉన్నవాట్లో, ఈ జత నాకు బాగా నచ్చింది. కాని చాలా బిగువు!" అంటూ చెప్పులు వదిలి వెళ్ళబోయాడు.

వీరాస్వామి, అతణ్ణి ఆపి, "తోలు చెప్పులు కదా! మొదట్లో అలాగే వుంటాయి. పదిరోజుల పాటు వాడారంటే, పాదానికి తగినట్టు సాగిపోతాయి. ఇప్పుడే సరిగ్గా సరిపోతే, పదిరోజుల తర్వాత పనికిరానంతగా వదులైపోతాయి," అన్నాడు.

ఆసామీ అవునన్నట్టు తలవూపి, చెప్పులకు డబ్బిచ్చి వెళ్ళిపోయాడు.

ఆ తర్వాత ఒకతను పదేళ్ళకొడుకును వెంటబెట్టుకువచ్చి, తనకు నచ్చిన చెప్పుల జతను వాడికి తొడిగి చూశాడు. అవి చాలా వదులుగా వున్నాయి.

అతను, వీరాస్వామితో, "నీ దుకాణంలో నాకు నచ్చిన చెప్పులివి. కాని చాలా వదులుగా వున్నాయి," అని చెప్పి వెళ్ళబోయాడు.

వీరాస్వామి, అతడితో, "అయ్యా, మీ పిల్లవాడిది ఎదిగే కాలుగదా! వదులుగా వున్నా, ఈ చెప్పుల జత కొనడమే మంచిది. మరి రెండు నెలలకు, మీవాడి పాదాలకు సరిగ్గా సరిపోతాయి," అన్నాడు.

"అవునవును, నేనామాటే మరిచాను!" అంటూ పిల్లవాడి తండ్రి, వీరాస్వామికి డబ్బిచ్చి తృప్తిగా వెళ్ళిపోయాడు.

ఈ విధంగా వీరాస్వామికి తెలిసివచ్చిందేమంటే—మాటనేర్పు, సమయస్ఫూర్తి లేనివాడు జీవితంలో ఎందునా రాణించడని.

—డా॥ బి. ఎస్. ఎస్. మూర్తి





# వీరహనుమాన్



వానరులు వేల సంఖ్యలో కుంభకర్ణుడి మీదికి దూకారు. వాళ్ళు ఆ పర్వతాకారుణ్ణి కొరికి, గీరి, పిడికిళ్ళతోనూ, మోకాళ్ళతోనూ పొడిచారు. కాని కుంభకర్ణుడు ఏ మాత్రమూ లక్ష్యపెట్టక, వానర సేనలను నిర్మూలించసాగాడు. కుంభకర్ణుణ్ణి ఆపటం వానరుల వల్ల కాదని స్పష్టమయింది.

అంగదుడూ, అతని తరవాత సుగ్రీవుడూ కుంభకర్ణుడి మీదికి కొండలు విసిరారు. కాని అవి అతన్ని ఏమీ చెయ్యలేకపోయాయి. అతను సుగ్రీవుడి మీదికి తన శూలం విసిరాడు. హనుమంతుడు దారిలో దాన్ని ఒడిసిపట్టుకుని, విరిచి పారేశాడు. ఇది చూసి వానరులు ఎంతో సంతోషించి, సింహనాదాలు చేశారు. అప్పుడు కుంభకర్ణుడు ఒక పర్వతశిఖరం విసిరి, సుగ్రీవుణ్ణి మూర్ఛపోగొట్టాడు. అది చూసి రాక్షసులు సింహనాదాలు చేశారు. కుంభకర్ణుడు మూర్ఛపోయిన సుగ్రీవుణ్ణి ఎత్తుకుని పోయాడు. సుగ్రీవుణ్ణి కాజేస్తే, రామ, లక్ష్మణులతో సహా వానరసేన వశమైనట్టేనని అతను అనుకున్నాడు. అతను సుగ్రీవుడితో సహా లంకలోకి వెళ్ళిపోయాడు.

ఇదంతా చూసి కూడా హనుమంతుడు భయపడలేదు. మూర్ఛ తెలియగానే సుగ్రీవుడు తనను తాను రక్షించుకోగలడని అతని నమ్మకం. అందుచేత అతను దిగులు పడవద్దని వానరులకు ధైర్యం

## 27. రామలక్ష్మణుల మూర్ఛ



చెబుతూ యుద్ధరంగంలో ఉండిపోయాడు.

అతను అనుకున్నట్టుగానే సుగ్రీవుడికి స్పృహవచ్చి చూసేసరికి, తాను కుంభకర్ణుడి భుజంమీద ఉన్నట్టు తెలిసింది. అతనికి లంకానగరపు వీధులు కనిపించాయి. అతను చప్పున కుంభకర్ణుడి ముక్కూ, చెవులూ కొరికేశాడు. కుంభకర్ణుడు నెత్తురు ఓడుతూ, సుగ్రీవుణ్ణి నేలకేసి కొట్టి, కాలితో మట్టగించాడు. అయితే సుగ్రీవుడు దాన్ని లక్ష్యపెట్టక, ఆకాశంలోకి ఎగిరి, రాముణ్ణి చేరుకున్నాడు.

సుగ్రీవుడు తప్పించుకుపోగానే కుంభకర్ణుడు తిరిగి యుద్ధభూమికి వచ్చి, వానరులను భక్షించసాగాడు. అప్పుడు లక్ష్మణుడు యుద్ధానికి వచ్చి, అతని మీద బాణాలు వేశాడు. కుంభకర్ణుడు వాటిని లక్ష్యపెట్టక, రాముడి మీదికి పోయాడు.

రాముడు అతనితో, "కుంభకర్ణుడా, నువ్వు ఇంద్రుణ్ణి జయించావు కాబోలు. నేను ఇంద్రుణ్ణి కాను, రాముణ్ణి. నిన్ను క్షణంలో చంపేస్తాను," అన్నాడు.

"రాముడా, నేను విరాధుణ్ణి కాను; వాలినీ, మారీచుణ్ణీ కాను, కుంభకర్ణుణ్ణి. నీ పరాక్రమం నామీద చూపించు, తరవాత నేను నిన్ను తినేస్తాను," అన్నాడు కుంభకర్ణుడు రాముడితో.

సాలవృక్షాలను ఛేదించటానికీ, వాలిని చంపటానికీ ఉపయోగించిన బాణాలను రాముడు కుంభకర్ణుడి మీద వేశాడు. కాని అవి అతన్ని ఏమీ చెయ్యలేకపోయాయి. అప్పుడు రాముడు అతని మీద వాయవ్యాస్త్రం ప్రయోగించాడు. దానితో కుంభకర్ణుడి చెయ్యి, గదతో సహా తెగి పడిపోయింది.

కుంభకర్ణుడు గట్టిగా అరిచి, రెండో చేత్తో ఒక పెద్ద వృక్షం పెరికి, రాముడి మీదికి వెళ్ళాడు. రాముడు ఐంద్రాస్త్రంతో కుంభకర్ణుడి రెండో చేతిని కూడా ఖండించేశాడు. అప్పటికీ కుంభకర్ణుడు రాముడిపైకి పోవ యత్నించాడు. రాముడు అతని

కాళ్ళు కూడా ఖండించాడు. చిట్ట చివరకు కుంభకర్ణుడి శిరస్సు కూడా ఖండించేశాడు.

కుంభకర్ణుడు చావగానే రాక్షసులు అమితమైన దుఃఖంతో పెద్దపెట్టున ఏడ్చారు. వాళ్ళు రాముణ్ణి చూసి హడలి పోయారు. వానరులు రాముడి చుట్టూ చేరి, అతన్ని పూజించారు.

కుంభకర్ణుడు రాముడి చేతిలో చచ్చాడన్న వార్త రాక్షసుల ద్వారా రావణుడికి చేరింది. ఈ మాట విని రావణుడు మూర్ఛపోయాడు. అతని కొడుకులైన దేవాంతకుడూ, నరాంతకుడూ, త్రిశిరుడూ, అతికాయుడూ పెద్దపెట్టున ఏడ్చారు. అలాగే కుంభకర్ణుడి తమ్ములైన మహోదరుడూ, మహాపార్శ్వుడూ ఏడ్చారు.

మూర్ఛ తెలిసిన రావణుడు, ఇక లంక వానరుల వశమవుతుందని భయపడ్డాడు. అతనికి రాజ్యంతోనే రుణం తీరినట్టు తోచింది. సీత మాట సరేసరి. అతను రాముణ్ణి చంపి తన తమ్ముడి కోసం పగ తీర్చుకోవాలనీ, లేదా తాను కూడా చావాలనీ నిశ్చయించాడు. విభీషణుడి మాట వినక, అతన్ని దూరం చేసుకున్నందుకు కూడా రావణుడిలో పశ్చాత్తాపం కలిగింది.



రావణుడి దుఃఖం చూసి త్రిశిరుడు, ''మూడు లోకాలనూ జయించగల నువ్వు ఇలా అధైర్యపడతావేమిటి? నన్ను యుద్ధానికి పంపు. నేను రాముణ్ణి చంపి వస్తాను,'' అన్నాడు.

ఆ మాట విని దేవాంతకుడూ, నరాంతకుడూ, అతికాయుడూ కూడా యుద్ధానికి పోతామని ఉబలాటపడ్డారు. రావణుడు వారిని చూసి పరమానందం చెంది, కౌగలించుకుని, యుద్ధానికి పంపాడు.

మళ్ళీ రాక్షసులకూ, వానరులకూ యుద్ధం జరిగింది. రాక్షస వీరుడైన నరాంతకుడు వానరులలో బీభత్సం కలిగిస్తూండటం చూసి, అతన్ని చంపమని



సుగ్రీవుడు అంగదుడితో చెప్పాడు. అంగదుడు నరాంతకుడితో కొంతసేపు యుద్ధంచేసి, చివరకు అతన్ని చంపేశాడు.

అది చూసి త్రిశిరుడూ, మహోదరుడూ, దేవాంతకుడూ అంగదుడి మీదికి వచ్చారు. అంగదుడు సాహసంతో ముగ్గురు రాక్షసులనూ ఎదిరించి పోరాడుతూండటం చూసి, హనుమంతుడు తోడు వచ్చి, ఒక్క గుద్దుతో దేవాంతకుణ్ణి చంపాడు. అలాగే అంగదుడికి తోడువచ్చిన నీలుడు మహోదరుణ్ణి చంపేశాడు.

మహాపార్శ్వుడితో ఋషభుడు భయంకరమైన యుద్ధం చేసి, చివరకు అతన్ని చంపాడు. మహాపార్శ్వుడు చావగానే రాక్షసులు ఆయుధాలు వదిలి పారిపోయారు.

యుద్ధానికి పోయిన రాక్షస వీరులు చచ్చారని తెలిసి అతికాయుడు బయలుదేరాడు. చిన్న పర్వతంలాగా వచ్చే అతికాయుణ్ణి చూసి, రాముడు విభీషణుడితో, "ఈ రాక్షస వీరుడు ఎవరు?" అన్నాడు.

"ఇతను రావణుడికి ధాన్యమాలిని వల్ల కలిగిన కొడుకు. అతికాయుడు. ప్రతాపంలో రావణుడంతటివాడు. ఇతను బ్రహ్మదేవుడి అనుగ్రహం పొంది, దివ్యాస్త్రాలు సంపాదించి, దేవతలచేతా, రాక్షసులచేతా చావు లేకుండా వరం పొందాడు. అతను ధరించిన కవచమూ, అతను ఎక్కిన రథమూ కూడా బ్రహ్మదేవుడు ఇచ్చినవే. వీటి సహాయంతో అనేకసార్లు ఇతను దేవతలనూ, దానవులనూ జయించి, రాక్షసులను రక్షించాడు. ఇతన్ని త్వరగా చంపకపోతే వానర బలాలకు తీవ్రమైన నష్టం కలిగించగలడు," అని విభీషణుడు రాముడితో అన్నాడు.

ఈ లోపల వానరసేన మీదికి వచ్చిన అతికాయుణ్ణి కుముదుడూ, ద్వివిదుడూ, మైందుడూ, నీలుడూ, శరభుడూ ఎదుర్కొన్నారు. కాని అతన్ని వాళ్ళు ఏమీ

చేయలేకపోగా, అతని బాణాలతో తీవ్రంగా బాధపడ్డారు.

అతికాయుడు తన మీదికి రాని వారి మీదికి పోక, తిన్నగా రాముడి వద్దకు వచ్చి, "పారిపోయే వాళ్ళతో యుద్ధం చెయ్యను. నాతో యుద్ధం చేసే ఉత్సాహం గలవారెవరు ?" అని అడిగాడు.

ఈ మాటకు లక్ష్మణుడు అలిగి, అతికాయుడి ముందుకు వచ్చి, ధనుష్టంకారం చేశాడు. అతన్ని చూసి అతికాయుడు, "లక్ష్మణుడా, చిన్నవాడివి. నీకున్న పరాక్రమం ఎంత ? నాతో ఏమని యుద్ధం చేయ వచ్చావు ? ఎందుకు వృథాగా చచ్చిపోతావు. అవతలికి వెళ్ళు." అన్నాడు.

"శౌర్యం చూపవలసినది మాటల్లో కాదు, చేతల్లో. నిన్ను నువ్వు పొగడుకోక, నీ పరాక్రమం నా మీద చూపు." అన్నాడు లక్ష్మణుడు.

ఇద్దరూ బాణాలతో యుద్ధం ఆరంభించారు. లక్ష్మణుడి బాణాల దెబ్బలు తిన్నమీదట అతికాయుడికి అతని మీద కొంత గౌరవం ఏర్పడి ఉత్సాహంతో యుద్ధం చేశాడు. ఇద్దరూ ఒకరి మీద ఒకరు దివ్యాస్త్రాలు ప్రయోగించారు. అతికాయుడి బాణాలు లక్ష్మణుణ్ణి బాధించాయిగాని, లక్ష్మణుడి బాణాలు



అతికాయుడి కవచాన్ని ఛేదించలేక పోయాయి. అందుచేత లక్ష్మణుడు అతని మీద బ్రహ్మాస్త్రం వేశాడు. అతికాయుడు దాన్ని ఆపటానికి చేసిన ప్రయత్నాలు ఫలించలేదు. ఆ బాణం అతికాయుడి తల నరికేసింది.

అతికాయుడి చావుతో రాక్షసుల శోకానికి అంతులేకుండా పోయింది. ఈ వార్త రావణుడికి చేరేసరికి అతను నిర్ఘాంతపోయాడు. ఎందుకంటే మేటి రాక్షస వీరులు ఒకరొకరే రామలక్ష్మణుల చేతిలో చచ్చిపోతున్నారు. వానరులను తక్కువ చెయ్యటం కూడా పొరపాటే అయింది.



తన తండ్రి విచారంలో మునిగి ఉండటం చూసి ఇంద్రజిత్తు, "నేను బతికి ఉండగానే నీకు విచారం దేనికి? నా బాణాల దెబ్బ తిని ఎవడూ ప్రాణాలతో బయటపడలేడు. ఈ రామ, లక్ష్మణుల ప్రాణాలు నేను తీస్తాను. ఇప్పుడే యుద్ధానికి బయలుదేరుతున్నాను," అన్నాడు.

అతను తండ్రి అనుమతి పొంది, ఉత్తమమైన కంచర గాడిదలు కట్టిన రథం ఎక్కాడు. అతను యుద్ధభూమికి పోతూంటే, అనేకమంది రాక్షసయోధులు రకరకాల ఆయుధాలు ధరించి, సంతోషంగా అతని వెంట వెళ్ళారు.

ఇంద్రజిత్తు యుద్ధభూమిని చేరి, దివ్యరథం సంపాదించటానికై హోమం చేయ నిశ్చయించి, రాక్షసులను తన చుట్టూ కాపలా ఉండమన్నాడు. తరవాత అతను మంత్రయుక్తంగా అగ్నిలో హోమం చేశాడు. అతను హవిస్సులు హోమం చేస్తూంటే, అగ్ని పొగలేకుండా పెద్ద జ్వాలలతో మండింది.

తరవాత ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రాన్ని జపించి, ఆ అస్త్రంతో తన వింటినీ, రథాన్నీ, ఇతర ఆయుధాలనూ మంత్రించాడు. హోమం పూర్తి అయింది. ఇంద్రజిత్తు తన రథంతోనూ, ఆయుధాలతోనూ, రథసారథితోనూ ఆకాశంలో అంతర్థానమయ్యాడు.

రాక్షససేన గుర్రాలతోనూ, రథాలతోనూ యుద్ధరంగానికి కదిలింది. రాక్షసులు వానరుల మీద రకరకాల ఆయుధాలతో యుద్ధం ప్రారంభించారు. ఇంద్రజిత్తు వాళ్ళను ప్రోత్సహించాడు. తరవాత అతను కూడా యుద్ధంలో ప్రవేశించాడు. అతను ఒక్కొక్క దెబ్బకు అయిదారుగురు వానరులను చంపసాగాడు. అతను మామూలు వానరులనే గాక, ముఖ్యమైన వానర వీరులందరినీ క్రూరంగా హింసించాడు. గంధమాదనుడూ, నలుడూ, మైందుడూ,

గజుడూ, సుగ్రీవుడూ, ఋషభుడూ, అంగదుడూ, ద్వివిదుడూ అతని బాణాలకు తీవ్రంగా గురి అయ్యారు. కాని, అదృశ్యంగా ఉన్న ఇంద్రజిత్తును వారు చూడను కూడా లేదు.

ఇంద్రజిత్తు ప్రయోగించిన బాణాలు రామ, లక్ష్మణులకు కూడా తగిలాయి. రాముడు లక్ష్మణుడితో, "ఈ ఇంద్రజిత్తు అదృశ్యంగా ఉండి యుద్ధం చేస్తున్నాడు. అందుచేత అతన్ని చంపలేం. మనం అతని బాణాల మూలంగా పడిపోయినట్టు ఉన్నామంటే, అతను సంతోషించి, లంకకు వెళ్ళిపోతాడు," అన్నాడు.

అలాగే రామలక్ష్మణులు బాణాల దెబ్బలు తిని పడిపోయారు. ఇంద్రజిత్తు సింహనాదంచేసి, లంకకు తిరిగివెళ్ళాడు.

ఇంద్రజిత్తుప్రయోగించినది బ్రహ్మాస్త్రం. ఎంతమంది వానరులు దానికి కేవలమూ బద్ధులయ్యారో, ఎంతమంది చచ్చిపోయారో తెలుసుకోవాలన్నాడు, హనుమంతుడు విభీషణుడితో.

హనుమంతుడూ, విభీషణుడూ చెరొక మండే కట్టెను తీసుకుని, యుద్ధభూమి అంతటా వెతకసాగారు. వాళ్ళకు ప్రాణాలతో ఉన్న జాంబవంతుడు కనిపించాడు. విభీషణుడు ఆ వృద్ధుణ్ణి పలకరించి, "ప్రాణాలతో ఉన్నావుగద!" అన్నాడు.




జాంబవంతుడికి చూపు దెబ్బ తిన్నది. అతను విభీషణుణ్ణి, "హనుమంతుడు బతికి ఉన్నాడా?" అని అడిగాడు.

"రామలక్ష్మణులను గురించి అడగకుండా హనుమంతుణ్ణి గురించి అడుగుతున్నావెందుకు!" అని విభీషణుడు జాంబవంతుడితో అన్నాడు.

"నాయనా, విభీషణుడా! హనుమంతుడు బతికి ఉండి, మిగతా వానర సేన అంతా చచ్చినా ఏమంత నష్టంలేదు. కాని అతను చచ్చిపోతే, వానర సేన అంతా బతికి ఉండినా మనమంతా చచ్చినవారితో సే జమ అవుతాము!" అన్నాడు జాంబవంతుడు.

పెద్దవాడు ఇలా అనేసరికి హను మంతుడు ముందుకు వచ్చి, జాంబ వంతుడి రెండు కాళ్ళూ పట్టుకుని నమస్కారం చేశాడు.

జాంబవంతుడు అతనితో, "నాయనా, హనుమంతుడా! ఇప్పుడు వానరుల నందరినీ నువ్వే రక్షించాలి. ఆ పనికి నువ్వు తప్ప మరెవడూ లేడు." అన్నాడు.

తరవాత రామలక్ష్మణుల మూర్ఛ పోగొట్టటానికి జాంబవంతుడు హను మంతుడికి ఒక పని చెప్పాడు:

"నువ్వు సముద్రం మీదుగా హిమా లయానికి వెళ్ళాలి. అక్కడ నీకు అమిత ఎత్తయిన శిఖరాలు కాంచనమూ, కైలా సమూ కనిపిస్తాయి. ఆ రెంటికీ మధ్యగా ఓషధిపర్వతం ఉన్నది. దాని శిఖరం మీద నాలుగు దివ్యమైన ఓషధులున్నాయి. అవి దేదీప్యమానంగా ప్రకాశిస్తూ ఉంటాయి. వాటి పేర్లు విశల్యకరణీ, మృతసంజీవినీ, సావర్ణకరణీ, సంధాన కరణీ. ఈ నాలుగు ఓషధులనూ తీసుకుని త్వరగా రా. వాటితో వానరులను బతికించి, ఆరోగ్యవంతులను చేద్దాం."

వెంటనే హనుమంతుడు వాయు మార్గాన బయలుదేరాడు. అతను సముద్రాన్నీ, పర్వతాలనూ, నదులనూ, అరణ్యాలనూ దాటుకుంటూ హిమ వత్పర్వతం కేసి అమిత వేగంగా వెళ్ళాడు.

హిమాలయాన్ని చేరగానే హనుమంతు డికి అనేక ఎత్తయిన శిఖరాలూ, ఆశ్ర మాలూ కనిపించాయి. బ్రహ్మకోశమూ, కైలాసపర్వతమూ, ఇంద్రుడు తపస్సు చేసిన చోటూ, రుద్రబాణ మోక్షస్థానమూ, హయగ్రీవ క్షేత్రమూ, బ్రహ్మకపాలమూ మొదలైన ప్రదేశాలను అతను చూశాడు. ఇంద్రుడికి బ్రహ్మ వజ్రం ఇచ్చిన చోటూ, కుబేరుడి స్థానమూ, బ్రహ్మసనమూ, శివధనుక్షేత్రమూ చూశాడు. ఆఖరుకు ఔషధిపర్వతం కూడా అతనికి, కైలాస పర్వతానికీ, ఋషభపర్వతానికీ మధ్యన కనిపించింది. దానిమీద ఓషధులన్నీ వెలిగిపోతున్నాయి.





# నిద్రకు మందు

పూర్వం గాంధారదేశంలో వజ్రగుప్తుడనే వర్తకుడుండేవాడు. చేస్తున్న వ్యాపారంలో లక్షల లాభాలు వస్తున్నా, అతడు ఎప్పుడూ ఏదో చెప్పలేని అసంతృప్తితో కనబడేవాడు. అది రానురాను మరీ ఎక్కువై అతడి కంటికి కునుకు పట్టడమే కష్టమవసాగింది.

ఒకరోజు పొరుగూరిలో వున్న వజ్రగుప్తుడి మిత్రుడు జయనందుడు, అతణ్ణి చూడడానికి వచ్చాడు. జయనందుడు సామాన్య కుటుంబీకుడు. ఉన్నదానితో తృప్తిపడి, ఏ చీకూ చింతా లేకుండా భార్యాపిల్లల్ని హాయిగా పోషించుకుంటున్నాడు.

వజ్రగుప్తుడు తనకు నిద్రపట్టని విషయాన్ని జయనందుడితో ప్రస్తావించి, పరిష్కారమేదైనా వుంటే చెప్పమని అడిగాడు.

జయనందుడు మందహాసం చేసి, "నీకీ నిద్రలేమి రోగం ఎందుకు పట్టుకున్నదో, నాకు అర్థమవుతున్నది. నువ్వు కొంత కాలంపాటు ఇప్పుడు చేస్తున్న వ్యాపారం గురించీ, అందులోని లావాదేవీల గురించీ ఆలోచించడం మానెయ్యి. ఏదో ఒక ఉబుసుపోని పని చేస్తూ కాలక్షేపం చెయ్యడం అలవాటు చేసుకోగలిగితే, నిద్ర దానంతట అదే ముంచుకు వస్తుంది," అన్నాడు.

ఇంతలో ఏవో జంతువులు వీధిలో అరుస్తున్నట్టు, మనుష్యులు వాటిని గట్టిగా అదిలిస్తూ వెళుతున్నట్టు శబ్దాలు వినబడినై.

జయనందుడు, "ఏమిటి, వీధంతా ఒకే గోల!" అన్నాడు.

"ఏమనిచెప్పమంటావు, జయనందా! ఊరివెలపల వున్న పచ్చికబీళ్ళలో

సాయిరాం ప్రసాద్



మేమైనా కలిగిందో లేదో తెలుసు కుంటాను,'' అని చెప్పి మిత్రుడి దగ్గిర సెలవుతీసుకుని వెళ్ళిపోయాడు.

రెండువారాల తర్వాత, జయనందుడు తిరిగి వజ్రగుప్తుణ్ణి కలిసినప్పుడు, అతడు మునుపటికన్నా అలసిపోయినట్టుండడం, కళ్ళు రెండూ చింతనిప్పుల్లా మెరుస్తూండడాన్ని గమనించి, ''ఏం, వజ్రగుప్తా! నేను చెప్పిన చిట్కాకూడా నీకు నిద్ర తెప్పించినట్లు లేదే?'' అని అడిగాడు ఆశ్చర్యంగా.

వజ్రగుప్తుడు చిరుకోపంతో, ''నిద్రా, పాడా! నువ్వు చెప్పినట్లే వీధి అరుగుమీద కూర్చుని, ఇంటి ముందునుంచి వెళ్ళిన ప్రతి గొర్రెనూ శ్రద్ధగా లెక్కపెట్టాను. తర్వాత నా లెక్కలో ఏమైనా తప్పుండవచ్చునేమో అన్న అనుమానం కలిగి, ఊరివెలపల వున్న చెరువుగట్టు మీద నిలబడి, దాపుల పచ్చికబీళ్ళల్లో మేస్తున్న అదే గొర్రెలను ఒకటికి రెండుసార్లు చాలా జాగ్రత్తగా లెక్కపెట్టాను. ఆశ్చర్యం! ఈ ఊళ్ళోనే వెయ్యి గొర్రెలున్నాయని నేనేనాడూ అనుకోలేదు సుమా!'' అన్నాడు.

''వెయ్యి గొర్రెలా! అంత కచ్చితంగా లెక్కపెట్టావన్న మాట. ఉబుసుపోని పనులు చేసేటప్పుడు కూడా అంత శ్రద్ధ

మేతకు వెళ్ళే ప్రతి గొర్రెలమందా, ఈ వీధినుంచే వెళ్ళాలితప్ప మరొక మార్గం లేదు. మరి, గోలకాక ఏమిటి,'' అన్నాడు వజ్రగుప్తుడు.

జయనందుడు ఉన్నట్టుండి ఏదో ఆలోచన వచ్చినవాడిలాగా, వజ్రగుప్తుడితో, ''అయితే నువ్వొక పని చెయ్యి. రేపటి నుంచి పొద్దస్తమానూ వీధి అరుగుమీద కూర్చుని, మైదానాల్లోకి మేతకు వెళ్ళే గొర్రెల మందల్లో, ఎన్ని గొర్రెలున్నాయో లెక్కపెడుతూ వుండు. ఇలాంటి ఉబుసుపోని పనులవల్ల, నీకు తప్పక నిద్ర వస్తుంది. నేను కొన్నాళ్ళ తరవాత మళ్ళీ వచ్చి నా సలహా వల్ల ఫలిత

అవసరమా అని, నాకనిపిస్తున్నది,'' అన్నాడు జయనందుడు.

అందుకు వజ్రగుప్తుడు, ''లెక్కన్నాక లెక్కే! అందులో నేనెలాంటి పొరబాట్లూ చెయ్యను. వెయ్యి గొర్రెల్ని అలా చూశాకనే గదా, వాటి దగ్గిరనుంచి కనీసం నాలుగు వేల సేర్ల ఉన్నిని సంపాయించవచ్చునని, నాకర్థమయింది,'' అన్నాడు.

జయనందుడు చిన్నగా నవ్వుతూ, ''నిన్ను లెక్కపెట్టమన్నది గొర్రెల్నికాని, అవి యిచ్చే ఉన్నిని కాదుగదా!'' అన్నాడు.

''నీకు తెలియనిదేముంది, జయనందా! ఈ ఊళ్ళో నిపుణులైన నేతగాళ్ళున్నారు. ఆ ఉన్ని వాళ్ళకిస్తే, కనీసం రెండువేల గజాల బట్టలయినా నేసి ఇవ్వగలరు. ఎంతలేదన్నా, గజం రెండు వరహాలు చేసి, ఆ సరుకును సులభంగా అమ్ముకోవచ్చును,'' అని వజ్రగుప్తుడు ఉత్సాహంగా ఇంకా ఏమో చెప్పబోయాడు.

అయితే జయనందుడు అతడి మాటలకు అడ్డుపడి, ''ఇంక నాకేమీ చెప్పనక్కర్లేదు. నేతగాళ్ళు నేసి ఇచ్చిన రెండువేల గజాల బట్టలను దుకాణంలో మురగబెట్టుకుని కూర్చుంటే నిద్రెలా పడుతుంది? ఆ సరుకంతా కదిలి లాభాలు చేతిలోకి వచ్చి పడ్డప్పుడే కదా!'' అన్నాడు.



వజ్రగుప్తుడికి, జయనందుడి మాటల్లోని వ్యంగ్యం, హేళనా అర్థమయి చురుక్కుమన్నది. అతడు సిగ్గుపడుతూ ఏదో చెప్పబోతూండగా, జయనందుడు అతణ్ణి వారించి, "చూడు, వజ్రగుప్తా! నీ ఇంటి ముందునుంచి వెళ్ళిన గొర్రెలు నీవి కావనీ, నువ్వు చేస్తున్నది ఉన్నివస్త్రాల వ్యాపారం అసలే కాదనీ, నీకు తెలియదా? అయినా, పొద్దస్తమానం పరిసరాల్లోని ప్రతివస్తువునూ వ్యాపార దృష్టితో చూస్తూ, చేసే ప్రతి పని నుంచీ ఏదో కొంత లాభం సంపాయించాలని చూస్తున్నావు. ఆ కారణంగానే, అర్థంలేని గుణకారాలు గుణించే నీకు, ఆ వ్యాపారదృష్టి రోగం బాగాముదిరి, కంటికి కునుకు కరువైందని గ్రహించాను. అందుకే నేను నీ ధ్యాసను మరొకవైపుకు మళ్ళించే ప్రయత్నం చేసి అందులో విఫలుణ్ణయ్యాను. నీ సమస్యను పరిష్కరించే సమర్థత, నాకు లేదని ఒప్పుకుంటున్నాను," అన్నాడు.

ఇది విన్న వజ్రగుప్తుడు ఉత్సాహంగా జయనందుడి వీపుతట్టి, "అదేమీ కాదు, జయనందా! నువ్వు నూటికి నూరుపాళ్ళు, నా సమస్యను పరిష్కరించావు. నీ పుణ్యమా అంటూ అసంతృప్తికీ, సుఖ నిద్రకూ వున్న సంబంధం ఏమిటో, నేనిప్పుడే కదా గ్రహించగలిగాను. నా రోగానికి మందేమిటో కూడా, నువ్వంతగా వివరించకుండానే నేను తెలుసుకున్నాను!" అన్నాడు.

జయనందుడు పెద్దగా నవ్వి, "అహాఁ, అలాగా! ఏమిటా మందు?" అని అడిగాడు.

వజ్రగుప్తుడు ఏదో రహస్యం చెబుతున్నవాడిలా చిన్న గొంతుతో, "నేనీ రోజునుంచే, ఈ వర్తకవ్యాపారాలన్నీ నా కొడుకులకు అప్పచెప్పి, శేషజీవితాన్ని నీలాంటి స్నేహితుల సాంగత్యంలో తృప్తిగా గడపదలుచుకున్నాను," అని పెద్దగా అవులిస్తూ, జయనందుణ్ణి మనసారా అభినందించాడు.





# బ్రహ్మరాక్షసి

ఒక గ్రామంలో పరమకిరాతకుడైన జమీం దారు ఒకడు ఉండేవాడు. ఆ గ్రామానికి సమీపంలో ఒక అడవి ఉండేది. ఆ అడవి కుండా ప్రయాణించేవారిని జమీందారు తన మనుషుల చేత చంపించి, వాళ్ళ సొత్తు కాజేస్తూ ఉండేవాడు. ఆ అడవి కుండా హెచ్చు ధనంతో ప్రయాణం చేయటం ప్రాణాపాయంగా ఉండేది.

ఒక శాస్త్రవేత్త అయిన పండితుడు రాజు గారినుంచి గొప్ప సన్మానం పొంది, జమీం దారుండే గ్రామం మీదుగా, అడవి అవతల ఉన్న తన స్వగ్రామానికి వెళుతున్నప్పుడు, జమీందారు మనుషులు హఠాత్తుగా మీద పడి ఆయనను చంపి, ఆయన వద్ద ఉన్న ధనం కాజేశారు.

దొంగలు ఆయన శవాన్ని ఎక్కడో అడవిలోనే పాతెయ్యటం వల్ల, ఆయన ఏమయినదీ ఎవరికీ తెలియలేదు.

కొంతకాలం గడిచింది. చనిపోయిన పండితుడి కొడుకు తన కొడుకును, పదేళ్ళ కుర్రవాణ్ణి, జమీందారు గ్రామంలో ఉన్న ఒక గురువు వద్దకు చదువుకునే టందుకు పంపాడు.

ఆ కుర్రవాడు అడవిదారిన నడుస్తూ వుండగా ఒక ముసలి బ్రాహ్మడు కనిపించి, "నావెంట రారా, బాబూ! నీకు సహాయం చేస్తాను," అన్నాడు. కుర్రవాడు ఆ బ్రాహ్మ ణుడి వెంట చెట్ల మధ్యకు వెళ్ళాడు.

అక్కడ ఆ బ్రాహ్మణుడు ఒక గుంట నుంచి ఒక చెంబు తీసి కుర్రవాడికి ఇచ్చి, "దీని నిండా బంగారం ఉన్నది. దీన్ని భద్రంగా ఉంచుకో. నువ్వు అడవి దాటి గ్రామం చేరేసరికి చీకటి పడుతుంది. ఈ రాత్రికి జమీందారుగారిని పడుకునే టందుకు చోటు ఇయ్యమని అడుగు!" అని చెప్పి ఎటో వెళ్ళిపోయాడు.



కుర్రవాడు చెంబుకు కట్టిన వాసెనగుడ్డ విప్పి చూస్తే అందులో నిజంగానే బంగారపు నాణాలు ఉన్నాయి. తనకు అంత డబ్బు అడగకుండా ఇచ్చిన ఆ బ్రాహ్మణ్ణి గురించి, ప్రేమగా ఆలోచిస్తూ కుర్రవాడు తన దారిన బయలుదేరాడు.

వాడు గ్రామాన్ని చేరేసరికి చీకటి పడింది. బ్రాహ్మడు చెప్పిన ప్రకారం వాడు జమీందారు ఇల్లు కనుక్కుని వెళ్ళి ఆ రాత్రికి తనకు పడుకునేటందుకు చోటు చూపించమన్నాడు. జమీందారు అందుకు సమ్మతించాడు.

ఆ రాత్రి కుర్రవాడు నిద్రపోగానే జమీందారు అటుగా వచ్చి, కుర్రవాడి పక్కనే ఉన్న చెంబు ఎత్తి చూశాడు. బరువుగా ఉన్నది. దాని మూతికి కట్టి ఉన్న గుడ్డ విప్పి, లోపల ఉన్న బంగారం చూశాడు.

అంత చిన్న కుర్రవాడికి అంత బంగారం ఎక్కడనుంచి వచ్చింది? వాడు దాన్ని ఏం చేసుకుంటాడు? వాడికి అది ఎవరిచ్చారు? ఈ విషయాలన్నీ విచారణ చేసే అధికారం జమీందారుకున్నది. కాని బంగారం గుట్టుచప్పుడు కాకుండా తీసేసుకుంటే సరిపోయేదానికి బహిరంగ విచారణ దేనికి?

అందుచేత జమీందారు చెంబులో ఉన్న బంగారం తీసేసుకుని, చెంబుకు మళ్ళీ గుడ్డవాసెన కట్టి, వెళ్ళి పడుకుని నిశ్చింతగా నిద్రపోయాడు.

కుర్రవాడు మర్నాడు ఉదయం లేచి, వెళ్ళిపోదామని చెంబు తీసుకుంటే అది తేలికగా ఉన్నది. గుడ్డ విప్పి చూస్తే లోపల బంగారం లేదు. వాడు జమీందారు దగ్గిరికి వెళ్ళి, "అయ్యా, నా చెంబు నిండా బంగారం ఉండాలి. దాన్ని ఎవరో దొంగిలించారు," అన్నాడు.

"నాకు దొంగతనం అంటగడతావురా? నేనెవరనుకున్నావు? నా మీద ఈ నింద మోపినందుకు నిన్ను ఉరితీస్తాను," అని జమీందారు తన భటులచేత ఆ కుర్రవాణ్ణి ఒక కొట్లో పెట్టించాడు.

తరవాత జమీందారు తన అడుగులకు మడుగులొత్తే గ్రామ పెద్దలను పిలిపించి, జరిగినదంతా చెప్పి, "నాకు దొంగతనం అంటగట్టినవాణ్ణి ఉరి తీయించడం న్యాయమేనంటారా?" అని అడిగాడు.

"దానికి సందేహమేమిటి? తప్పక ఉరి తీయవలిసిందే! లేకపోతే మీరు ప్రతి కుర్రకుంకకూ లోకువైపోతారు!" అన్నారు జమీందారు సలహాదార్లు.

కుర్రవాణ్ణి ఉరి తియ్యబోతున్నట్టు చాటింపు జరిగింది. ఆ సాయంకాలం ఉరి శిక్ష చూడటానికి వధ్యస్థానం దగ్గిర ప్రజలు గుమికూడారు. కుర్రవాణ్ణి ఉరితీయడానికి తీసుకొచ్చారు. దగ్గిర ఉండి శిక్ష అమలు చేయడానికిజమీందారుస్వయంగావచ్చాడు.

అప్పుడు జనం మధ్య నుంచి ఒక బ్రాహ్మడు జమీందారును సమీపించి, "ఈ కుర్రవాణ్ణేనా ఉరితీయబోతున్నారు? వాడేం చేశాడు?" అని అడిగాడు.

"ఆ మాట అడగటానికి నువ్వెవరు?" అని జమిందారు బ్రాహ్మణ్ణి అడిగాడు.

"నేను వాడి తాతను. వాడు నా మనవడు," అన్నాడు బ్రాహ్మడు.

"అలా అయితే, నీ మనవడు నాకు దొంగతనం అంటగట్టాడు. పోనీ గదా అని రాత్రి వాణ్ణి మా ఇంట పడుకోనిస్తే వాడి బంగారం నేను కాజేశానుట. నా పరువు తీసేశాడు. అలాటివాణ్ణి కఠినంగా శిక్షిస్తాను," అన్నాడు జమీందారు.

"ఒక పని చెయ్యండి. వాడి ఆరోపణ నిజమైతే మిమ్మల్ని బ్రహ్మరాక్షసి ఎత్తుకుపోవాలని ప్రమాణం చెయ్యండి. అప్పుడు మీరు న్యాయం చేసినట్టు లోకానికి వెల్లడి అవుతుంది," అన్నాడు బ్రాహ్మడు.

"దానికేం అభ్యంతరం? ఆ కుర్రవాడు నా మీద చేసిన ఆరోపణ నిజమైతే నన్ను బ్రహ్మరాక్షసి ఎత్తుకుపోవుగాక!" అన్నాడు జమీందారు.

మరుక్షణం ఆ బ్రాహ్మడు జమీందారునెత్తుకుని వాయువేగంతో అడవికేసి పారిపోయాడు. తరవాత జమీందారు ఏమయ్యాడో ఎవరికీ తెలీదు.





# పక్షపాతబుద్ధి!

విజ్జేశ్వరం అనే గ్రామంలో, సోమిదమ్మ అనే ఒక ఆస్తిపరురాలు నివసించేది. ఆమెకు ఇద్దరు కొడుకులు, ఒక కూతురు. సోమిదమ్మ తన ముప్ఫైయవ ఏట భర్త పోయినతరవాత, జాగ్రత్తగా ఆస్తి వ్యవహారాలు చూసుకుంటూ, తన ముగ్గురు సంతానాన్ని పెంచి పెద్ద చేసింది. కొడుకులతోపాటు, కూతురుకు కూడా ఆ గ్రామంలోనే మంచి సంబంధం చూసి పెళ్ళిళ్ళు చేసింది.

ఆమె పెద్దకొడుక్కు ఇద్దరు కొడుకులు, రెండో కొడుక్కు ఒక కూతురు, ఒక కొడుకు; కూతురుకు, ఒక కూతురు పుట్టారు. అసలుకన్న వడ్డీ ముద్దు అన్నట్టు సోమిదమ్మ ఇప్పుడు తన సొంత సంతానం కన్న మనమలూ, మనమరాళ్ళూ అంటేనే అమితమైన ప్రేమ కనబరుస్తున్నది.

పిల్లలు ఎదిగివస్తున్నకొద్దీ, వాళ్ళ చదువుల గురించి బెంగపడుతున్న కొడుకులను చూసి సోమిదమ్మ, "ఇక్కడి ఆస్తి వ్యవహారాలు మీరు చూసుకోండి. నేను పిల్లలను పట్నం తీసుకుపోయి, ఏదైనా మంచి పాఠశాలలో చేర్పిస్తాను. అందరం ఏదో ఒక అద్దె ఇంట్లో వుంటాం. నేను వాళ్ళను జాగ్రత్తగా చూసుకుంటాను. సెలవులకు ఇంటికి వచ్చి పోతూ వుంటాం," అని చెప్పింది.

అందుకు కొడుకులు, ఎంతో సంతోషించి, "అమ్మా, మమ్మల్ని పెంచి పెద్ద చేసినట్టే, వీళ్ళనుకూడా, నీ ఒద్దికలో వుంచుకుని చదువు సంధ్యలు అబ్బేలా చూడు," అని ఏకకంఠంగా ఆమెను కోరారు.

సోమిదమ్మ, కొడుకుల పిల్లల్ని తీసుకుని పట్నం చేరి, అక్కడ వాళ్ళను ఒక

జె. ఉదయనాగశిరీష

మంచి పాఠశాలలో చేర్చి, అద్దె ఇంట్లో వుండసాగింది. కొద్ది రోజుల తర్వాత కూతురూ, అల్లుడూ కూడా తమ కూతురును సోమిదమ్మ దగ్గిరకు తీసుకు వచ్చారు.

సోమిదమ్మ కూతురు తల్లితో, ''అమ్మా, అన్నయ్యల పిల్లలతోపాటు, నా కూతురును కూడా కనిపెట్టి వుంటూ ఇంత చదువు చెప్పించు,'' అన్నది.

ఇందుకు సోమిదమ్మ సంతోషంగా సరే నన్నది.

కాని, ఆనాటినుంచీ సోమిదమ్మ మనమలలో విపరీతమైన మార్పు వచ్చింది. వాళ్ళు తమ నాయనమ్మకు పక్షపాత బుద్ధి వున్నదని అనుకోసాగారు.

అందుకు కారణం ఏమంటే, సోమిదమ్మ అందరికీ ఒకే పంక్తిలో భోజనం పెట్టినా, కూతురు తరఫు మనమరాలికి మాత్రం పెరుగు, నెయ్యి మారు అడిగితే, మారు మాట్లాడకుండా వేసేది. ఇది కొడుకుల పిల్లలకు బాధగా వున్నా, నాయనమ్మ అంటే వున్న భయంకొద్దీ నోరు మెదపలేక పోయేవారు. అయితే, సోమిదమ్మ పెద్ద కొడుకు కొడుకు వివేకుడు మాత్రం, ఇదేమీ పట్టించుకునేవాడు కాదు.

ఇలా వుండగా, అందరూ సెలవులకు పట్నంనుంచి విజ్ఞేశ్వరం వచ్చారు. ఇంటికి వచ్చీరాగానే, సోమిదమ్మ మనవళ్ళూ, మనవరాలు—ఒక వివేకుడు తప్ప, అందరూ నాయనమ్మ పక్షపాత



బుద్ధి గలదంటూ తల్లులకు చెప్పారు. ఇది విన్న కోడళ్ళకు, అత్తగారి మీద పట్టరానంత కోపం వచ్చింది.

వాళ్ళు ఈ విషయమై సోమిదమ్మను నిలదీయాలనుకుని, అందరికన్న పెద్ద వాడైన వివేకుణ్ణి పిలిచి, జరిగినదంతా చెప్పమన్నారు. అంతలో వాడి తల్లి పట్టరాని కోపంతో, "ఏం, కూతురు కూతురుకు పెట్టడానికి వచ్చిన చేతులు, మీకు పెట్ట డానికి రావా?" అన్నది.

అందుకు వివేకుడు, "అమ్మా! నాకు మాత్రం నాయనమ్మలో ఎటువంటి పక్షపాతబుద్ధీ కనిపించలేదు. ఆవిడ పెరుగు పోసినా, నెయ్యి వేసినా, అత్తయ్య కూతురుకు రహస్యంగా వెయ్యడం లేదు!" అన్నాడు.

"అదేరా, నేననేది! అదేదో మీకూ వెయ్యవచ్చు గదా?" అన్నది వివేకుడి తల్లి.

తల్లి మాటలకు కాదన్నట్టు వివేకుడు తలాడిస్తూ, "ఎంతయినా మేం నాయనమ్మ సొంత పిల్లలం. అత్తయ్య కూతురు అలా కాదు. పేరుకు మనమరాలయినా పొరుగింటి పిల్ల. అందువల్ల, అదంటే కాస్త అభిమానం, పక్షపాతం చూపిస్తే, మన కొచ్చిన నష్టం ఏమిటి?" అన్నాడు.

ఇందుకు సోమిదమ్మ కోడళ్ళు ఏదో జవాబు చెప్పబోయేంతలో, పక్కగదిలో వుండి అంతా విన్న సోమిదమ్మ అక్కడికి వచ్చి, కోడళ్ళతో, "చిన్నవాడైనా వివేకుడు, మీరనుకునే నా పక్షపాత బుద్ధి గురించి బాగా వివరించాడు. అయినా, ఎందుకొచ్చిన గొడవ. మనం పాలూ, నెయ్యీ కొనలేనంత పేదవాళ్ళం కాదు. ఇకనుంచి మనవళ్ళూ, మనవరాళ్ళూ నన్ను గురించి అపోహ పడకుండా చూస్తాను, సరేనా!" అన్నది.

ఆ జవాబుతో సోమిదమ్మ కోడళ్ళకు, అత్తగారి మీద కోపం పోవడమేగాక, అతి చిన్న విషయానికి ఇంత రాద్ధాంతం చేసినందుకు విచారం కూడా కలిగింది.



# ప్రకృతి వింతలు :



## 'యుద్ధనౌక'

ఇంగ్లీషులో పోర్చుగీస్ 'మేన్-ఆఫ్-వార్' అంటే పోర్చుగీసు యుద్ధనౌక అని అర్థం. అయితే అదొక జలచరం పేరు మాత్రమే। పడవలాంటి ఉపరి భాగంతో 30 సెం.మీ. పొడవూ, 15 సెం.మీ. వెడల్పూ గల ఈ వింత జలచరాన్ని, నావికులు 18వ శతాబ్దంలో కనుగొన్నారు. చూడటానికి పోర్చుగీసు యుద్ధనౌకలా కనిపించడంతో దానికా పేరు పెట్టారు. అడుగున 'పోలిప్స్' అనే జంతువులు పొడుగువీ, పొట్టివీ మీసాల్లా వేలాడుతూ వుంటాయి. పొడవాటివి ఆహారాన్ని పట్టుకుంటాయి. పొట్టివి వాటిని తిని జీర్ణింపజేస్తాయి. పై భాగం గాలి నిండిన తిత్తిలా వుండడంవల్ల ఈ జంతువులు నీళ్ళపై తేలుతూ వెళతాయి.

## కాఫీ కథ!

ఎథియోపియాలోని 'కఫా' ప్రాంతంలో ఒక మేకలకాపరి ఒకనాడు తన మందలోని కొన్ని మేకలు ఒకమొక్క పళ్ళు తిన్న కొంతసేపటికల్లా గంతులు వేయడం గమనించాడు. ఆ పళ్ళ ప్రత్యేకత ఏమిటా అని, అతడుకూడా కొన్ని పళ్ళు కోసి తిన్నాడు. కొంతసేపటికి కొత్త ఉత్సాహం కలిగినట్టనిపించింది. వెంటనే అతడు కొన్ని పళ్ళు కోసుకుని, వెళ్ళి తన గురువుగారికి ఇచ్చాడు. ఆయన వాటితో పానీయం తయారు చేశాడు. ఆ పానీయం తాగితే చాలాసేపు నిద్రపోకుండా వుండ వచ్చని కనుగొన్నారు. ఆ పళ్ళు 'కఫా'లో లభించినందువల్ల ఆ పానీయానికి 'కాఫీ' అని పేరు పెట్టారు.





## 'బీవర్' హెచ్చరిక!

పెద్ద ఉడతలాగా వుండే ఒకరకం ఉభయచర జంతువు బీవర్. ఇది నెలయేళ్ళను ఆనుకుని వున్న పొడవాటి చెట్లను తమ పదునైన పళ్ళతో కొరికి పడదోసి, వాటితో చిన్న ఆనకట్టలు ఏర్పరచుకొని నివసిస్తాయి. చెట్లను పడగొట్టినప్పుడు, చెట్టు కింద మరే జంతువూ పడిపోకుండా హెచ్చరిస్తూ, బీవర్ తన బలమైన తోకతో నీళ్ళపై కొట్టి పెద్ద శబ్దం పుట్టిస్తుంది. ఆ శబ్దం విని మిగతా బీవర్‌లు సురక్షిత ప్రాంతాలకు పారిపోయి, ప్రాణాలు కాపాడుకుంటాయి.

దూరతీరాలలో ఉన్న మీ బంధుమిత్రులకు
మీరు ఇవ్వదగిన ప్రియాతి ప్రియమైన కానుక

# చందమామ



**వారికి కావలసిన భాషలో చందమామను అందజేయండి :**

అస్సామీ, బెంగాలీ, ఇంగ్లీష్, గుజరాతీ, హిందీ, కన్నడం, మలయాళం,
మరాఠీ, ఒరియా, సంస్కృతం, తమిళం, తెలుగు.

**దూరదేశంలో ఉన్నప్పటికీ వారికి మాతృదేశంలో ఉన్న మధురానుభూతిని కలిగించండి ।**

సంవత్సర చందా :

ఆస్ట్రేలియా, జపాన్, మలేషియా & శ్రీలంక

సీ మెయిల్ ద్వారా : రూ. 105.00 ఎయిర్ మెయిల్ ద్వారా : రూ. **252.00**

ఫ్రాన్స్, సింగపూర్, ఇంగ్లండు, అమెరికా,
పశ్చిమజర్మనీ & ఇతర దేశాలు

సీ మెయిల్ ద్వారా : రూ. 111.00 ఎయిర్ మెయిల్ ద్వారా : **252.00**

మీ చందాలను 'చందమామ పబ్లికేషన్స్' పేరు మీదుగా డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా గాని,
మనిఆర్డర్ ద్వారా గాని కింది చిరునామాకు పంపండి :

**సర్క్యులేషన్ మేనేజర్, చందమామ పబ్లికేషన్స్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600026**

# ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 100/-

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1992 అక్టోబరు నెల సంచికలో ప్రకటింపబడును.





M. Natarajan — M. C. Morabad

★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ ఆగస్టు నెల 15 వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 100/-లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: - చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

## జూన్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: విగ్రహంతో నేస్తం! — రెండవ ఫోటో: ఆగ్రహిస్తే కష్టం!

పంపినవారు: అమమాను వేణు, S/o. సత్యనారాయణ, జిల్లా వరంగల్,
వరంగల్ - 506 008, (ఆం. ప్ర.)

బహుమతి మొత్తం రు. 100/- నెలాఖరులోగా పంపబడుతుంది.

## చందమామ

ఇండియాలో సంవత్సర చందా: రూ. 48-00

చందా పంపవలసిన చిరునామా:

డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026

Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.

# పాడుదాం తీయగా క్యాంప్కో పాట!

పాలు మీగడ నిండినది. కమ్మని కలలా రుచికరమైనది.

ఇది నాకు నచ్చిన చక్కని చాక్లెట్. క్యాంప్కో క్రీమీ మిల్క్ చాక్లెట్.

భారతదేశపు అతిపెద్ద అత్యాధునిక కర్మాగారం నుండి,
క్యాంప్కో లిమిటెడ్, మంగుళూరు.




R K SWAMY/BBDO CL 10117 TL


ఇంట్లో డాక్టర్‌తో!


డాక్టర్ బిజీగావున్న ఒకరోజు...
నీవు ఈ మధ్య స్వీట్స్ ఎక్కువగా తింటున్నావా?
ఒక్కొ స్వీట్లేనా... ఐస్‌క్రీములూ... కేకులూ...


ఐతే ఏదీ... నీ పళ్లు పరీక్ష చేయనీ.
ఆ.. ఆ..


అబ్బ! ఎన్ని క్రిములో!


!!!


ఈ క్రిములు నోటి నలుమూలలా పెరిగి నీ పళ్లకి బెజ్జాలు పెడతాయి.
బెజ్జాలే!!


నీ పళ్లు గట్టిగా వుండాలంటే క్రిములుండకూడదు.


మీ మమ్మీకి తెలుసా. క్రిములతో పోరాడే టూత్‌పేస్ట్ ఏదో? కొత్త పెప్సొడెంట్ తెమ్మని అమ్మకి చెప్పండి. ఇందులో విప్లవాత్మకమైన జెర్మి-చెక్ ఫార్ములా వుంది. పెప్సొడెంట్ క్రిములతో పోరాడటమే కాదు... వాటి నుంచి రక్షణనిస్తుంది. దాంతో మీ పళ్లు గట్టిగా ఆరోగ్యంగా వుంటాయి.
NEW
Pepsodent